# ఆధారములు

(కథా సంపుటి)



జనస్వామి కోదండరామశాస్త్రి

# ఆధారములు

(కథల సంపుటి)

## జనస్వామి కోదండ రామశాస్త్రి

1937 సెప్టెంబరు



వెల 0—6—0

# తొలి మాట

మన ఆంధ్రభాషలో కార్మికోద్యమము వృద్ధిఅయ్యే టందులకు తోడ్పడే కథలు ఎక్కువగా లేవు. మన హిందూ దేశములో యీనాడు కార్మిక జనము పొందుచున్న బాధ లన్నింటిని వర్ణిస్తూ యీకథలు వ్రాయడమైనది. రెండవభాగ ములోని అయిదు కథలునూ కార్మికలోక కళ్యాణమును వీణస్వరంమీద గానము చేయుచున్న వాహిని పత్రికలో ప్రకటింప బడినవి.

మొదటి భాగములోని కథలన్నియూ నేటి తెలుగు పత్రికలలో ప్రకటితములై వున్నవి. నాకథలన్నిటినీ ఒక సం పుటముగా తయారుజేయమని నాస్నేహితులు కొందరు నన్ను ప్రోత్సాహించడంవల్ల నేను యీపనికి పూనుకున్నాను. యీసంపుటమునకు 'ఆధారములు' అని ఎందులకు నామకర ణము జేసినానో యీకథలు దేనికి ఆధారములో, పాఠకులగు మీరు నాకథల్లోని ఆశయములనుబట్టి నిర్ణయించాలి. ఇందు మొదటిభాగములోని 'భవాని' అను కథ కొందరికి కోపకార ణము గావచ్చును. సంఘంలో అవినీతిని ప్రవేశపెట్టేందులకు మాత్రం అది వ్రాయలేదు. యీనాడు హిందూసంఘములో 'ఆచారము' అనే పేరిట జరుగుచున్న అవినీతిని రూపుమాపు టయే యీకథయొక్క ముఖ్యోద్దేశము.

తాయారు అనేకథలో, యీనాటి హిందూసంఘము లోని స్త్రీలోకమునకు జరుగుచున్న అన్యాయములను బయలు పర్చినాను.

ఈకథలను చదివి మీరు ఆనందించినా నాకు సంతోషమే; తిట్టినా నాకు సంతోషమే. మొత్తానికి మీరు నాఆశయములను అర్థంచేసుకుని, అందులో ఏకొంచెమైనా ఆచరణలోకి తీసుకు రాగలుగుదుమా అని ఆలోచించడమే నాకు కావలసినది.

జనస్వామి కోదండరామశాస్త్రి,
కొల్లూరు.

# విషయసూచిక

## మొదటి భాగము



## రెండవ భాగము

# 1. తాయొత్తు

ఆదివారంనాడు మా ఆఫీసుకు సెలవుకావటంచేత, ఆరోజు మధ్యాహ్నం పన్నెండు గంటలకు నిద్రపోయాను. ఎంతసేపు నిద్రపోయానో నాకే తెలియదు. మా ఇంట్లోవారు ఎవ్వరూ లేపనూలేదు నేను కోప్పడతానన్న భయంచేత. సాయంత్రానికి ఎవరో కొట్టి లేపినట్టు నాకు నిద్ర మెలకువ వచ్చింది. నామంచానికి ఎదురుగావున్న గడియారంవంక జూచాను కండ్లు నలుపుకుంటూ. చిన్నముల్లు నాలుగు అంకెమీద, పెద్దముల్లు రెండుఅంకెమీద వున్నవి. నాఅవివేకానికి నేనే ఆశ్చర్యపోయాను. ఇంతలో మాభద్రం లోపలినుంచివస్తూ "బావా! ఇప్పటికైనా కుంభకర్ణుడు వదిలాడా? అన్నాడు నవ్వుతూ, నావీపుమీద తనచేతితో తట్టుతూ. కొంచెం నీళ్లతో కండ్లు తుడుచుకుంటూ లోపలికి వెళ్ళాను. కమలం తలుపుచాటున నుంచుంది. ఆమెవైఖరినిబట్టే తెలుసుకొన్నాను నేను చేయమన్నపని చేయలేదని.

"కాఫీ తయారయిందా" అన్నాను.

"ఇవ్వాళ్ళ కాఫీ కాయలేదు" అంది బిక్కముఖంతో.

ఆమెముఖం చూచేసరికి నాకు జాలీ వేసింది, కాని చెప్పినపని చేయలేదని నాకు చాలాకోపమూ వచ్చింది.

"ఎందువల్ల కాయలేదు" అన్నాను.

"కాచేవేళకు మా అన్నయ్యవచ్చాడు. మాట్లాడుతూ కూర్చున్నాడు" అంది కొంచెంభయంగా. "ఏరా! భద్రం నిజ

మేనా అన్నాను, వాడివంక కండ్లు పెద్దవిగాజేసి. "అవును బావా" అన్నాడు భద్రం సగంప్రాణంతో, వాడినేమైనా అంటా నేమో అనే భయంవల్ల. భద్రం, నేనూ కలసి కాఫీహోటలుకు వెళ్ళివచ్చాము. దొడ్లో భజనచేస్తూన్న శబ్దం వినిపించింది. భద్రం, నేనూ దొడ్లోకి వెళ్లాము. మా అమ్మడూ (చెల్లికి ముద్దుపేరు) ఎవరో కొంతమంది ఆడపిల్లలూ భజనచేసుకుంటున్నారు. మమ్మల్నిజూచి వాళ్లుసిగ్గుతో భజన ఆపుదలచేశారు. వాళ్లభజన నాకెంతో ముచ్చటగా కన్పించింది. "అమ్మడూ! ఫరవాలేదు. భజనచేసుకోండి" అన్నాను నెమ్మదిగా. "అలా అయితే నవ్వకూడదు అన్నయ్యా" అంది. నేనూ, భద్రం వాళ్లకు కొంచెం దూరంగా కూర్చున్నాం. వాళ్లు మెల్ల మెల్లగా గంతులువేస్తూ పాండురంగని భజనకీర్తనలు పాడటం మొదలెట్టారు. వాళ్లల్లో ఒక పిల్ల మహా చాకచక్యంగా చేస్తోంది భజన. కంఠం కిన్నెర కంఠమే అనాలి. ఎంతమందో హార్మోనియములమీద పాడుతూండగా విన్నాను. ఎంతోమంది వీణమీద పాడుతూండగా విన్నాను. కాని ఎవరి కంఠాల్లోనూ లేదు, ఆపిల్ల కంఠంలో వున్న మధురనాదం. విశాలంగా వున్న నేత్రాల్ని పెద్దవిగా జేస్తూ పాడుతుంటే, గానంలో మాధుర్యం లేదని ఎవరు అనగలరు. ఆమె నోరు తెరచినప్పుడల్లా అమృతం ఒలుకుతున్నదా అనిపించేది. పరికిణీ లోపలికి దోపి, మెల్ల మెల్లగా గంతులు వేస్తూ పాడుతోంటే, ఆమెమనస్సును తప్పకుండా భగవంతుడు ఆకర్షించుతాడనాలి. ఆమెనేత్రములు మూసుకునినృత్యం

జేస్తున్నప్పుడల్లా, ఆమెముందు భగవంతుడున్నాడు అని పించేది. ఆమె శరీరఛాయ సువర్ణంలాగా తళతళ మెరుస్తోంది.

ఆమె విశాల నేత్రాలు భగవంతునికి స్వాగత మిస్తు న్నాయి రమ్మని.

మా భద్రంవంక జూచి చిన్నగా నవ్వుతూ యిలా అన్నాను. "ఓరేయ్! ఆ అమ్మాయిని జూచావూ! మన అమ్మడు ప్రక్కగావున్న అమ్మాయి. ఏం భక్తిరా! ఆమె గానాన్ని పాములుగూడా పడిగెలువిప్పి వింటాయిరా. కాస్తో కూస్తో సంగీతం నేర్చుకుని 'మేము పెద్ద నటీమణులము' అని విఱ్ఱవీగే యీనాటి సినిమా తారలు ఆమెదగ్గఱ ఎందుకు పనికి వస్తారురా" అన్నాను.

భద్రం నాలుకచప్పరిస్తూ "ఏం లాభం? ఎన్నివుంటే యేం? అదృష్టం లేకపోయినతర్వాత..." అన్నాడు కొంచెం విచారంతో.

"ఏంరా! అలా అంటున్నావేం?" అన్నాను కంగారు పడుతూ.

"ఆ అమ్మాయిభర్త పోయినాడు. రెండేండ్లయింది" అన్నాడు.

ఆమాట నాచెవుల్లో బడేసరికి 'అబ్బా' అన్నాను, ఎంతో నిస్సారంగా. తలమీద పిడుగు పడినట్లయింది. కండ్లు గిరగిర తిరిగినాయి. నామనస్సు ఒక్కనిముసకాలంలో దుఃఖ సముద్రంలో మునిగితేలింది. ఆ నిముసకాలంలో ఎన్నో ప్రశ్నలు నామనస్సు నెదుర్కొన్నాయి. ఆ ప్రశ్నలకు సమా

ధానం చెప్పేదెవరు? ఆ ప్రశ్నలకు సమాధానములు చెప్పే వారు కనుక యీ ప్రపంచంలో వున్నట్లయితే హిందూసంఘంలో ఆచారం పేరిట యిల్లాంటి ఘోరాలు జరుగనే జరుగవు. నన్నెదుర్కొనిన ప్రశ్నలన్నీ ఆనిముసం తప్పిన తరువాత తలుపుకురానేలేదు. రెండు ప్రశ్నలుమాత్రం అప్పుడు కాదు, ఇప్పుడుకాదు, ఎప్పుడూ నాజీవితంలో జ్ఞప్తికి రాకమానవు. ఆ రెండు ప్రశ్నలేమిటంటే, ఒకటి: ఆమె భవిష్యజ్జీవితం ఎట్లా గడపాలి? రెండు: ఆమెకు ఈకష్టములన్నీ భరించగలశక్తి వున్నదా? ఆనిముసంలో అప్పటి కప్పుడే ఆరెండు ప్రశ్నలకు నామనస్సే సమాధానములు చెప్పింది. కాని అవి నా కంతగా తృప్తికరముగా లేవు.

ఆనిముసం అయిపోయినతర్వాత భద్రంవంక చూచాను "ఎవరురా ఆ అమ్మాయి!" అన్నాను. "ఏమోబావ ! ఆ అమ్మాయి భర్త చచ్చిపోయినాడని మట్టుకు నాకు గట్టిగా తెలుసు" అన్నాడు.

"ఆ అమ్మాయికి పన్నెండు సంవత్సరాలు పూర్తిగాక మునుపే......" అని చెప్పబోతుండగా భద్రం అందుకుని "వివాహాలు ఎంతచిన్న వయస్సులో జరుగు తున్నాయో, వైధవ్యాలు కూడా అంత తొందరగానే వస్తున్నాయి. మన ఆచారాల నెరుగవూ!" అన్నాడు, నాలుక చప్పరిస్తూ. ఆమె కంఠనాదం నాకు ఆనందంగానే ఉందిగాని, ఆమె ముఖాన్ని జూచేసరికి అంతకంటే రెండింతలు దుఃఖంగావుంది. ఆ సుకుమారజీవి, తన భవిష్య జ్జీవితంలో సంఘం కట్టుబాట్లకు 'ఎట్లా

కట్టుబడి వుంటుందో అని నే నెంతో కలవర పడ్డాను. నా శరీరం కంపించి పోయింది. చీకటిపడిన తర్వాత భజన ఆపి వేసి ఎవరింటికి వారెళ్లారు. మా అమ్మడు ఇంటికొచ్చింది.ఆ అమ్మా యినిగురించి కొన్ని విశేషాలు మా అమ్మడుని అడిగి తెలుసు కుందాం అనుకున్నాను. ఆరోజున అమ్మడు భోజనంచేసే టప్పుడే నేను కూడా భోజనానికివస్తానని చెప్పాను కమలంతో.

అమ్మడుతోనే భోజనానికి కూర్చున్నాను. కొంచెంసే పాలోచించి "అమ్మడూ! నీ ప్రక్క కూర్చున్న అమ్మాయి యెవరే?" అన్నాను.

"ఆ అమ్మాయి వైష్ణవులపిల్ల. పేరు తాయారు" అంది మా అమ్మడు. ఆమాటలు చెపుతూన్నప్పుడు మాఅమ్మడు ముఖంలో ఒకవిధమైన విచారభావం కనబడ్డది. కొంచెంసేపు నిశ్శబ్దంగానే భోజనం చేసాను. పదినిముసాలయిన తర్వాత "అమ్మడూ! ఆ అమ్మాయి మొగుడు ఏం చదువుతున్నాడే" అన్నాను.

"ఆ అమ్మాయి మొగుడు చచ్చిపోయినాడు. చాలా రోజులయింది. ఆ అమ్మాయికి మొగుడు చచ్చిపోయి నాడన్న విచారమే తెలీదు. ఎప్పుడూ భజనచేసుకుంటూ ఉంటుంది. మా బళ్లోవున్న ఆడ పిల్లలందరూ తమ భర్తలను గురించి సర దాగా చెప్పుకొంటూంటే తాయారు వాళ్లవంక ఎంతో దీనంగా చూస్తుంది. అప్పుడు నేను ఆ అమ్మాయిలో వున్న విచారాన్ని మార్చెయ్యడానికి ఏదోఒక ధోరణిలోకి దింపు తాను. ఆ అమ్మాయి తలిదండ్రులు ఆ అమ్మాయి యెదుట

ఏడవరు. కారణ మేమిటంటే, ఆ అమ్మాయి విచారంలో మునుగుతుందేమో అనే భయంచేత. ఈ సంవత్సరం నన్ను మా అత్తవారు తీసుకెళ్లినపుడు "ఏమోయి! కాంతం! నాలు గురోజులనుంచీ బళ్లోకి రావడంలేదే" అని అడిగింది, నేను మా అత్తవారింటినుంచి వచ్చినతర్వాత. యథార్థం చెపితే ఆ అమ్మా యిని ఏడిపించినదాన్ని అవుతానని ఏమీ మాట్లాడకుండ మూకీ భావంతో వూరుకున్నాను. మళ్లీ అప్రశ్నే నాలు గైదు తడవలు అడగటం ప్రారంభించింది. నాకేమీ తోచింది కాదు. కొంచెంసేపాలోచించి మా అన్నయ్య అత్తవారిం టికి వెళ్లానని బదులుచెప్పాను......" అని చెప్పబోతుండగా లోపలనుంచి మా అమ్మవచ్చి "ఏమిటా సోది కాంతం? తొంద అగా తిను" అనికోప్పడింది. మళ్లీ అయిదునిముషాలు మెదల కుండా వూరుకుంది మా అమ్మనుు. మళ్లీ కదిలించాను. ఇలా చెప్పడం మొదలెట్టింది...... "తాయారుకు భర్త దగ్గిఱ చుట్టమే అవుతాడట. ఆమె తండ్రికి మేనల్లుడట. అసలా అబ్బాయి ఎప్పుడూ జబ్బువాడేనట. ఎప్పుడూ దగ్గుతూండే వాడట. అట్లాంటివానికిచ్చి వివాహం చెయ్యవద్దని తాయారు అమ్మ ఎంతగా చెప్పినప్పటికీ, ఆమాటలను పెడచెవినిబెట్టి, తల్లిదండ్రులు లేకపోవటంచేత చిన్నప్పటినుంచీ పెంచిన మోహాన, తండ్రి ఆ అబ్బాయికిచ్చి వివాహం చేశాడట. పెండ్లి అయిన ఆరునెలలమునా తిఱుగక మునుపే ఆ అబ్బాయి యీలోకంనుంచి సెలవు తీసుకున్నాడు. అన్నయ్యా! నాకు ఆ అమ్మాయిని గురించి చాలా విచారంగా వుంటుంది. ఆ

అమ్మాయి భజన ఎంతో భక్తిగా జేస్తుంది. మిగతా వాళ్ళందరూ ఏదో సరదాగా గంతులు వేస్తూ, మధ్యమధ్య కొంటెతనంగా నవ్వుతూ భజన చేస్తూంటాం. ఆఅమ్మాయి మాత్రం తదేక దీక్షతో కళ్ళుమూసుకుని నృత్యం చేస్తూ పాడుతూంటే, ఎటువంటి దుర్మార్గుల హృదయాల్లోనైన భక్తి ప్రవేశిస్తుంది.

"అన్నయ్యా! ఆభజన మాకు శాశ్వతంగాదు. రెండు మూడు సంవత్సరాలు చేసుకుంటాం. యీభజనతరవాత ఎల్లాగో మమ్ములను అత్తవారు ఫర్మానా చేసి లాక్కెళతారు. 'భర్త' అనే వాడ్ని గురిపెట్టుకుని, ఆయనతో ఎంతో సౌఖ్యము అనుభవించవచ్చుననీ. (తరువాత కష్టములు అనుభవించినా చిన్నతనంలో అనగా పన్నెండేండ్ల వయస్సునందు రజస్వల కాక మునుపు బాలికల హృదయాల్లో యీలాంటి భావములు దొర్లుతూంటాయి) ఆయననే దైవముగా భావిద్దామనీ, మాటా, పోరుపూ లేకుండా భర్తతో సుఖంగా కాలంగడపాలనీ, అత్త మామలతో ఎంతో వినయ విధేయతలతో వుండాలనీ,...... ఒక్కటేమిటి?... ...అనేక భావాలు మాహృదయాల్లో పరువెత్తుతూవుంటాయి. ఈ వయస్సులో యిలా తలవడమేగాని, ఆచరణ రూపం దాల్చేసరికి ఒక్క కోరికా నెరవేరదు. కార్య రూపం వచ్చేసరికి భర్త తుంటరి కావడమో లేక అత్త మామలు కఠినులై కొరంటికం పెట్టడమో, సంభవించగానే యీ కోరికలకు తగట్టు మంచిపేరు లేకపోగా, ఒక్కొక్క అడది తన దురదృష్టంవల్ల సంఘంలో ఎంతో నీచంగా పరిగణింపబడుతుంది భర్త ఎంత తుంటరితనంగా కొడుతూ,

తిడుతూ, అతినీచంగా చూస్తున్నా సంఘం మొగవాడ్ని ఏమీ అనదు. భార్య ఆబాధలను సహించలేక పుట్టింటికి వెళ్ళిందా! దాన్ని ఎంతో నీచంగా చెప్పుకుంటుంది సంఘం. పైగా భర్త కొట్టినా, తిట్టినా, ఎన్ని బాధలు పెట్టినా సహించి వూరుకోవాలి. భార్యపై, భర్తకు సంపూర్ణాధికారం వుంది. ఏమైనా చేయొచ్చు అంటుంది సంఘం......"అని యింకా చెప్పబోతుండగా నేను భోజనం చేయడం అయిపోవడంవల్ల లేచివెళ్ళాను.

గదిలో ఒక కుర్చీమీద నేను, మరో కుర్చీమీద కమలం కూర్చున్నాం. కమలం నాకు తమలపాకులను అందిస్తోంది. కమలం అందిస్తూన్న తమలపాకులను నమలుతూ, ప్యాసింగుషో సిగరెట్టు ముట్టించాను.

ఇంతలో మా అమ్మడు (కాంతం) వచ్చింది. నాకెదురుగా వున్న కుర్చీలో కూర్చుని, అదికూడా పళ్లెంలోని తమలపాకులకు సున్నంరాసి తనవదెనకిస్తూ, ఆమెకు సగం శ్రమతీర్చింది. విన్నకొద్దీ వినాలనిపిస్తూన్నద తాయారమ్మను గురించి. ఎవరైనా అవుతే టూకీగా చెప్పేద్దురేమోగాని, మా అమ్మడు తాయారు జీవితాన్ని ఎంతో రమ్యంగా జెపుతూ, మధ్య మధ్య స్త్రీ స్వాతంత్ర్య భావాన్ని కలుపుతోంది. అమ్మడులో యింతగా స్వాతంత్ర్య భావాలు ఇమిడి వున్నాయని నేనెన్నడూ తలవలేదు. మళ్లీ యిప్పుడు కదిలించాను. "అమ్మడూ! ఆ అమ్మాయి దురదృష్ట వంతురాలే" అన్నాను కొంచెం విచారంగా. మా కమలం నావంకజూచి చిన్నగా నవ్వింది.

'మళ్లీ ధోరణిలోకి దిగారా' అన్నట్లుగా......

"అన్నయ్యా! మేమందరమూ భవిష్య జీవితంలో ఒక వ్యక్తిని ఆధారంగా గైకొని ఆనందిస్తుంటాము. పాపం! ఆ అమ్మాయి ఏవ్యక్తిని ఆధారం చేసుకొని ఆనందిస్తుంది? పోనీ ఎవరినైనా అతనిస్థానం ఆక్రమించుకోనిద్దామా అంటే, ఆమె వంక సంఘం భయోత్పాతమైన నేత్రాలతో చూస్తుంది. ఆమె ఎప్పుడూ ఏకాకిగా కుమిలిపోతూ జీవించాల్సిందే! ఈ భక్తి ఎన్నాళ్లు నిలుస్తుంది? అన్నయ్యా! వితంతువులకు తలలు బోడులు చేయట మెందుకు? తలలు బోడులయితే తలపులు బోడులవుతాయా?" అని విమర్శచేస్తూ చెపుతోంది. ఈనాటి బాల వితంతువులను గురించి మా అమ్మడు అభిప్రాయం తెలుసుకుందామని "అమ్మడూ! బాల వితంతువులను గురించి నీ అభిప్రాయం ఏమిటి" అన్నాను కొంచెం చమత్కారంగా.

"సంసార సుఖాలలో ఇచ్ఛవున్నవారికి వివాహానికి సంపూర్ణంగా అధికారముండాలి. సంసారమందు ఇచ్ఛలేని వారికి ప్రత్యేకంగా ఆశ్రమాలను ఏర్పఱచి తత్వబోధ చేస్తూ వైరాగ్యం గలుగ జేయాలి. ఏదీలేకుండా అందర్నీ ఒకేదీక్షకు కట్టుబడి ఉండమంటే ఎలాకుదురుతుంది? ఈదురాచారాలు సంఘాన్ని చీలదీస్తున్నాయి" అని చెపుతూ తొమ్మిది గంటల యింది, నిద్రొస్తోంది అని చర, చర వెళ్లబోయింది. కమలం నావంక జూచి నవ్వుతూ "మీరందరూ ఒక తల్లిబిడ్డలు కాదూ! మీరేమో వేదికనెక్కి స్త్రీస్వాతంత్ర్యాన్ని గురించి ఉపన్యాసము లిస్తున్నారు, ఆపిల్లేమో ఇంట్లోవుపన్యా

సాలిస్తోంది" అంది.

"నీవుకూడా అలాగా................" అని నేచెపు తూన్నవాక్యం పూర్తిగాకమునుపే "నాకేం నచ్చలేండి ఆవేషా లన్నీ, వితంతువులకు పునర్వివాహాములేమిటి? కాంతం ఆమా టలు చెపుతూ ఉన్నంతసేపూ నాకు అసహ్యంగానే వుంది. ఆయీాడు పిల్లకు ఆమాటలేమిటి? పదమూడేండ్లపిల్ల అంత స్వేచ్ఛగా మాట్లాడ వచ్చునా? ఆమాటలు ఇప్పుడు మీాకు ముద్దుగానే వుంటాయి. అసలు యిందువల్లనే ఆడవాళ్లు విద్య కనస్తులంటారు మనపెద్దవాళ్లు." అంది. (కమలం పూర్వకా లపు ఆశయాలు కలదిలేండి. సనాతన అభిప్రాయాలుగూడా కొన్ని వున్నాయి ఆమెలో.) "సనాతనాశయములు గల నీదృష్టిలో అలాగే కనపడుతూంటుంది కాంతం! దాని ఆశయములు దేశక్షేమానికి ఎంత బలవత్తిలో తెలుసునా" అన్నాను సిగరెట్టు అవతల పారవేస్తూ.

* * *

మర్నాడు సాయంకాలం నేను ఆఫీసుకు వెళ్లలేదు. మాఅమ్మడు, కొందరు పిల్లలూ మళ్ళీ భజన చేయడం మొద లెట్టారు దొడ్డిలో. నేను గుమ్మంలో కూర్చున్నాను. అందరి పిల్లలలోనూ ఒక్కతాయారే గదా అభాగిని! నాహృదయంలో దుఃఖతరంగాలు లేస్తున్నాయి. ఆమె లోలకు మలయమా రుతంలో ఎలా కదుల్తూ నృత్యం చేస్తూన్నవో, ఆమాదిరి గానే నాహృదయంలో నృత్యం జేస్తూన్నాయి దుఃఖ తరం గాలు. నా నేత్రములతో తాయారు నింక జూడలేకపోయాను.

కండ్లు గట్టిగా మూసుకున్నాను. కండ్లు మూసుకున్నప్పటికీ తాయారును గురించిన కొన్ని దృశ్యాలు కనపడ్డాయి. నాశరీరమంతా వేడెక్కింది! కండ్లు తెరిచాను. బాష్పధారలు నా నేత్రముల వెంబడి కారుతున్నాయి. జేబుగుడ్డను అడ్డంగా వుంచాను కండ్లకు. అప్పటికీ ఆ ప్రవాహం ఆగలేదు. అక్కడ యిక కూర్చోలేక పోయాను. వెంటనే గదిలోకి వెళ్ళాను.

ఆనాడు రాత్రి మళ్ళీ భోజనం దగ్గఱ నేనూ, అమ్మడూ కలుసుకున్నాం. ఇదివఱకు అమ్మడు నన్ను జూస్తే కొంచెంగా భయంగా వుండేది. ఎప్పుడూ స్వేచ్ఛగా మాట్లాడి ఎరుగదు. ఆ రాత్రి సంభాషణతో అమ్మడుకు పూర్తిగా భయం నశించినది. వీలైనప్పుడల్లా నాదగ్గఱకువచ్చి కూర్చుని రాజకీయ విషయాల్ని గురించి చెప్పమనేది. ఆమెతో చర్చించడమంటే నాకూ యిష్టముగానేవుండేది. కొన్నాళ్ళయ్యేసరికి తాయారు, మా అమ్మడూ, యిద్దరూ వచ్చేవాళ్ళు. వాళ్ళిద్దరూ అన్ని రాజకీయ విషయాలకంటే స్పెయిను స్త్రీలు రణరంగమున జూపుతూన్న ధైర్యసాహసములను గురించీ, ఇటలీ స్త్రీలు యుద్ధముకొఱకు తాలిబొట్టులను సైతము అర్పించిన దేశసేవను గురించీ, చాలా శ్రద్ధగా వినేవాళ్లు. నేను చెపుతోంటే తాయారు అందుకుని "అన్ని దేశాల స్త్రీలకంటే మనస్త్రీలే హీనస్థితిలో వున్నారు. అయిదేండ్ల పిల్లను కదిలించినా గృహకృత్యాల్ని గురించే చెపుతుంది. మనదేశపు స్త్రీలుకూడా ఇటలీ, స్పెయిన్, స్త్రీలలాగా తయారైతే......... ఇంకా ఆవాక్యం సంపూర్తిగాకముందే మా అమ్మడు " అంత అదృ

ష్టమే మనకువుంటే, మాతృదేశదాస్యశృంఖలను తేలికగా త్రెంపవచ్చు. ఈ పరాధీనతలోవుండి కుమిలిపోవటం ఎందుకు సంభవిస్తుంది?" అంది. నేను చెప్పినవిషయాలు మా అమ్మడు కంటే అతిసూక్ష్మంగా గ్రహించేది. రాజకీయ విషయాలకు సంబంధించిన కొన్ని పుస్తకాలను ఇవ్వమని కోరింది. లైబ్రరీ లోనుంచి కొన్ని పుస్తకాలను తెచ్చి ఇచ్చాను. ఆ పుస్తకాలను అతిశ్రద్ధతో చదవడం—చదవడమైనతర్వాత ఆ పుస్తకాన్ని నాకిచ్చి, నాముందట ఆపుస్తకంలోవున్న భావాల్ని విమర్శించడం—ఇలా జరుగుతున్నాయి ఆమెచర్యలు. ఈమెను దేశసేవకిగా తయారుచేయడం చాలా తేలిక అనుకున్నాను. ఒకనాడు సాయంత్రం కొన్ని దేశీయగీతాల్ని ఆమెకు వ్రాసియిచ్చి, రేపటినుంచీ వీటినిగూడా భజనలో కలపమని జెప్పాను.

మర్నాడు భజనదగ్గఱకు వెళ్లి కూర్చున్నాను. నేను వ్రాసియిచ్చిన గీతాలు ఎంతో శ్రావ్యంగా పాడింది తాయారు. తన తోటిబాలికలను గూడా దేశసేవికలనుగా తయారుజేయ గలదని నాకు తోచింది. రోజూ సాయంత్రం సమయాన తాయారు, అమ్మడూ, నాదగ్గఱకు వచ్చేవాళ్లు. మేము ముగ్గురమూ పైడాబావిమీద కూర్చొనే వాళ్లం. అతిబాల్యవివాహములచేత మనదేశపు స్త్రీలు గడపు దుర్భర కష్టమయజీవితములను గురించీ, వరశుల్కములను గురించీ, అస్పృశ్యతవల్ల కలుగు చెడుగు, మొదలగు సాంఘిక దురాచారములను గురించీ చెప్పేవాణ్ణి. చీకటి పడంగానే ఆపేసేవాణ్ణి.

ఈ విధంగా రెండు సంవత్సరములు గడిచినాయి. మా

అమ్మడు పెద్దమనిషి అయింది. పెద్దమనిషి అయిన సంవత్సరము గడువక మునుపే, ఆమె భర్త ఫర్మానా చేయడం మొదలెట్టాడు. అతని పలుకులను నిర్లక్ష్యంగా విని కొంతకాలం గడిపాను. మా యింట్లో ముసలమ్మలు తొందర చేయడం మొదలెట్టారు. మా అమ్మడుకుమాత్రం దేశ స్వాతంత్ర్యానికి పాటు పడాలనివుంది. చివఱకు తప్పిందికాదు. మా అమ్మడు వివాహ కారకులైన తల్లదండ్రులను ఎన్నోవిధాల దూషించింది. బాల్య వివాహమువల్ల దేశ స్వాతంత్రము కొఱకు స్త్రీలు తమ జీవితాల్ని అర్పించుటకు వీలులేకుండా వుంది. మా అమ్మడు అత్తవారింటికి వెళుతూ "తాయారూ! దేశసేవ నీసొమ్ము. దానికి నీవే తగినదానివి. అజ్ఞానంలో మునిగి వున్న యీనాటి స్త్రీ లోకానికి నీవు నిధివై, సంఘ క్షేమము నకు తోడ్పడుదువుగాక! నాకా అదృష్టంలేదు. ఇది బాల్య వివాహ ఫలితం. స్వాతంత్ర బీజాలు నా హృదయంలో మొలకలెత్తుతున్నాయి. ఆ లేత మొక్కలకు నీరు పోయకుండా మాడ్చి చంపవలసినదేనా? ఎరుగవూ! అత్తవారింటికి వెళ్లినది మొదలూ దాస్యవృత్తియే........"అని భోరుమని యేడుస్తూ తాయారును ఆలింగనం చేసుకుంది.

అమ్మడు అత్తవారింటికి వెళ్లినప్పటికీ తాయారు దినచర్య మానలేదు. ఇంతలో తాయారు పెద్దమనిషి అయింది. అప్పటికీ తాయారు సాయంకాల సమయాన మాయింటికి రావడంమానలేదు. అప్పుడప్పుడు ఆమెతల్లిదండ్రులు ఎక్కడికీ పోకూడదని చివాట్లుపెట్టేవారట. క్రమక్రమంగా ఆమె నాద

గ్గఱకు రావడం మానేసింది. ఎందుకు రావడంలేదాఅని నాకూ మథనగానే వుండేది. ఆమె కనపడితేకాదూ ఏమైనా అడగ టానికి! అసలు కనబడటమే మానేసింది.

మాఅమ్మడు అత్తవారింటికి వెళ్ళిన తర్వాత ఆమెలో మొలకలెత్తుచున్న స్వతంత్రభావములు నాశనమొందాయి. కేవలమూ వంటమనిషిగా ఎంచబడుతోంది. వార్తాపత్రిక చూస్తే తప్పు; గుమ్మంలో నిలుచుంటే తప్పు; యీవిధంగా ఘోషాగా మెలుగుతోంది. భర్త దృష్టిలో అతి నీచంగా చూడబడుతోంది. అతడు విద్యాధికుడే; బి. ఏ. చదివినవాడే. అయితేమాత్రమేం! పూర్వాచారపరాయణుడు. అమ్మడు ఆనాటి కానాటికి కృశించిపోతోంది. చిక్కి శల్యమైనది. అప్ప టికీ ఆమెకు ఇంట్లో చాకిరీ తప్పటంలేదు. ఈవిధంగా ఎందరు యువతులు అవస్థపడటం లేదూ!

# 2. ఆనందభంగము

శివనాథరావు మైలాపూర్‌లో అద్దెకు ఇంటికోసరం ఒకపూట ఆఫీసుకి సెలవుపెట్టి తిరుగుచున్నాడు. సిటీస్‌లో ఏయిల్లు అద్దెకిచ్చేదో తెల్సుకోవటం చాలా తేలిక. అద్దెకివ్వబడే ఇంటిమీద "టులెట్ అద్దెకివ్వబడును." అని వ్రాసిన బోర్డు వుండి తీరుతుంది. అద్దెగూడా దాని మీదనే వ్రాసివుంటుంది. ఎంతదూరం తిరిగినా అతనికి టులెట్ బోర్డువున్న యిల్లు ఒక్కటీ కనబడడంలేదు. శివనాథరావు గట్టి పట్టుదలతో ఆపేట అంతా గాలించి తిరుగుతున్నాడు. మైలాపూర్‌లో కాపురముంటే అతనికి ఎంతో హాయి. అక్కడకు ఆఫీసు దగ్గరలో వున్నది. మాటి మాటికి ఆఫీసు కెళ్ళాల్సొస్తుంది. ఆహారకేం బాధ? ఆఫీసుమేడ వెనుక భాగంలో కాపురం. యింటిలోకూర్చొని రమ్మని చీటికిమాటికి ఫోనులో చెబుతూంటాడు. ఆఫీసుకి, యిప్పుడు కాపురమున్న యింటికి రెండుమైళ్ళ దూరం. ఆఫీసు కెళ్ళాల్సొచ్చి నప్పుడల్లా రిక్షాకి ఒక పావులా ఖర్చు. పోనీ, ట్రామ్‌కి ఒకఅణా పారేసి వెళదామా అనుకుంటే అన్నప్పుడల్లా ట్రాములు వుండవు. ఈఅవస్థలే, మైలపూర్‌లోనే కాపురముండాలి అనే అతని గట్టిపట్టుదలకు కారణములు శివనాథరావు విసుగు లేకుండా తిరిగినందులకు ఫలితం కనిపించింది. రెండు అంతస్థుల మేడ-చుట్టూ ప్రాకారము చూడంగానే ఏసంపన్నుని గృహమో, లేక ఏఆఫీసుగృహమో అని తోస్తుంది. పైఅంతస్థు గోడమీద టులెట్ బోర్డువున్నది

అద్దె ఎక్కువేమోనని ఆలోచించకుండా ఈమధ్య యెక్కడా ఆగకుండా సరాసరి వరండాలోకి వెళ్ళాడు. లోపలి ద్వారం దగ్గర ఆగాడు. తలుపు వేసియున్నది. ఏమని పిలవడానికి అతనికి ధైర్యం చాలలేదు. ఓపది నిముషాలు తటపటాయించి "ఏమండీ" అని మెల్లగాను బిగ్గరగాను గాకుండా మధ్యస్థాయిలో అనగలిగాడు. లోపలినుంచి జవాబేమీరాలా! "ఏమండోయి" అని కొంచెం హెచ్చుస్థాయిలో పిలచాడు. లోపలనుంచి "ఎవరు? " అన్న మృధుమధుర కంఠస్వరమూ, దానివెంటనే తలుపుచప్పుడూ, ఆచప్పుడు ఆగిపోగానే ఒక సుందర విగ్రహాన్నిజూచి శివనాధరావు పెదవులే కదల్చలేకబోయాడు. ఆతడ్నిజూచి, ఆయువతి వెంటనే వెనుకకు మరలి తలుపు కొంచెం ఓరవాకిలిగా వేసి, సిగ్గుతో చిరునవ్వుతో, లోపలికెళ్ళింది. వరండా గోడకు తగిలింపబడియున్న చిత్రపఠములను జూస్తూ, ఆచిత్రములను చిత్రించిన చిత్రకారుల సామర్థ్యాన్ని మనస్సులో మెచ్చుకుంటూ మొదట నిలబడిన ప్రదేశానే నిలబడియున్నాడు. తలుపుచాటునుంచి "ఎవరు? " అని వినబడినది. ఆస్వరంలో వున్నంత మధురత్వమూ, సరళత్వమూ, స్ఫుటమూ, యీ స్వరంలో లేవు. శివనాధరావు నిలబడిన చోటునుంచి కదలకుండానే ముఖం కొంచెం అవతలికి పోనిచ్చి చూశాడు. వయసు మరలిన ఒక పునిస్త్రీ తలుపు చాటున నిలబడివుంది, అతడు తన పెదవులను కదల్చాలని ప్రయత్నించకముందే కదిలాయి. "యీ యింట్లో అద్దెకిచ్చే భాగాలేమైనా వున్నాయండీ?" అన్నాడుపెద్దలపైజూపేవినయ

విధేయతలతో. "పైభాగముందండి. ఇల్లు చూస్తారా?" అని అతని అంగీకారం తీసుకోమునుపే జవానుని పిలచి "వారికి పైభాగము చూపవ్రోయ్" అంది. జవాను ముందూ, శివనాధ రావు వెనకా, మేడయెక్కారు. జవాను శివనాధరావుకి యిల్లు విశదంగాచూపాడు. ఫలాని గది వంటగది, ఫలానిగది పడకగది, ఫలాని గది స్నానాలగది అని వివరంగా చెప్పాడు. మేడ బాగానేఉంది. విశాలంగానూ వుంది. మూడుగదులూ, ఒకచిన్నవరండా వున్నాయి. పట్నంలో యింతకంటే విశాల మైన గృహం దొరుకుతుందా? మేడంతా జూడడంఅయింది. శివనాధరావు మెల్లాలో ఏదో ఆలోచిస్తూ నిలబడ్డాడు. "చూచారుగదూ!" అన్నాడు జవాను. "ఈమేడ ఎవరి దోయ్?" అన్నాడు శివనాధరావు జవానువైపు కన్నార్ప కుండాజూస్తూ.

"భారత ఇన్సూరెన్సు కంపెనీ మేనేజరు గారిది" అన్నాడు జవాను.

"పేరూ...!" అన్నాడు శివనాధరావుముఖం చిట్లిస్తూ, ఆశ్చర్యంగా.

"వాసుదేవ అయ్యర్ గారు..."

"అయితే యీభాగానికి అద్దెయెంతో చెప్పగలవా?"

"నాకు తెలవదుబాబూ! క్రిందకెళ్ళి అమ్మణీగారిని అడిగివస్తాను." అని జవాను మెట్లుదిగి క్రిందకువెళ్ళాడు. అయిదు నిమిషాల్లో జవాను పైకొచ్చి అయ్యా! అమ్మగారు మిమ్మల్ని మీారు ఒక్కరూ కాపురముంటారో, కుటుంబముతో

కాపురముంటూగో కనుక్కొని రమ్మన్నారు” అన్నాడు. యీ ప్రశ్న యెందులకు రావల్సొచ్చిందా అని సందేహం కలిగింది శివనాధరావుకి. సమాధానం యిచ్చి పంపిస్తే ఎందులకైనా మంచిదిగదా అని “ కుటుంబంతో సహా వుంటానని” చెప్పమన్నాడు. జవాను మళ్లీ క్రిందకు వెళ్ళాడు. పదినిముషాల్లో పైకొచ్చి “అద్దె పది రూపాయిల లోపుగ వుంటుందట. సాయింత్రం వస్తే మగవారు యింటి దగ్గర వుంటారు. మాట్లాడ వచ్చునన్నారు” అన్నాడు. “పది రూపాయలకు లోపేనా” అన్నాడు ఆశ్చర్యంగా శివనాధరావు. “అవును. సాయంకాలం రండి, వారితో మాట్లాడొచ్చు” అన్నాడు జవాను. “అయ్యా! దొడ్డిచూద్దురుగాని రండి” అని మేడకు ముందువైపునున్న ఖాళీస్థలంలోనికి తీసుకెళ్లాడు జవాను ఆతడ్ని. ఆఖాళీస్థలంలో తీగెపూలచెట్లపందిళ్లు నాలుగైదున్నాయి. పందిళ్ళపైభాగములందు, ఎర్రనిపుష్పాలు, పచ్చనిపుష్పాలు, తెల్లనిపుష్పాలు నాట్యం జేసున్నాయి. గులాబి, మల్లె, సంపెంగ, వృక్షాలున్నాయి. మందమారుతమునకు వృక్షములు కొమ్మలు తలలను పైకెత్తి మేఘమయమైన ఆకాశము వంక జూచుచూ అల్లల్లాడుతున్నాయి. ఎంత అద్దెయైనాసరే యీయింట్లో వుండాల్సిందే ననుకున్నాడు శివనాధరావు.

శివనాధరావు, తాను యిప్పుడుంటూన్న ఇంట్లోకి గబగబా వచ్చాడు. నీరజ ఎక్కడా కాన్పించలేదు. నీరజ, శివనాధరావులు ఈ విషయములో ఒక్క పందెం పెట్టుకు

న్నారు. మైలాపూర్‌లో యిల్లు దొరికితే పది రూపాయ లిస్తానుమీకు" అన్నది ఇదివరలో నీరజ. "సరే చూడు. ఎల్లాగైనా కష్టపడి ఇల్లువెతికి నీదగ్గర లాగాలి" అన్నాడు రావు. సమయం వచ్చింది. నీరజను కొంచెంసేపు ఏడిపించా లని ఇంట్లో యంతా వెతికాడు. లోపలి వరండాలోకి వెళ్లాడు. నీరజ మల్లె పుష్పములను దండగా గ్రుచ్చుతోంది. శివనాధ రావుని జూచి చిరునవ్వుతో లేచి నిలుబడ్డది. "నీరజా! పది రూపాయలు సిద్ధపరచు" మన్నాడు రావు చిన్నగా నవ్వుతూ. "ఏదో చిన్నగది కుదుర్చుకు వచ్చారుగాబోలు! అసలు ఇంట్లో ప్రవేశింపనీయండి. అప్పుడు యిస్తాను పది రూపాయ" లన్నది నీరజ సొంపుగా. "అప్పటికి వుంటయ్యో వుండవో అని, యిప్ప టినుంచే సిద్ధంచేసుకోమని చెపుతున్నాను."

శివనాధరావు సాయంకాలానికి కూడా ఆఫీసుకి శెలవు చీటీపంపించి మైలాపూర్‌కు వెళ్లే కారులో యెక్కాడు. వాసు దేవయ్యంగారు బయటి వరండాలో కూర్చుని ఏదో రికార్డు చూచుకుంటున్నారు. జవాను గేటునుంచి శివనాధరావును వెంటబెట్టుకునివచ్చి "అయ్యా! వుదయాన వచ్చినవారు వీరే" అన్నాడు. వాసుదేవఅయ్యంగారు తగువిధముల మర్యాదాచేసి కుర్చీచూపించారు కూర్చొనమని. శివనాధరావు "అపరిచితులు యింత మర్యాదా చేస్తున్నారే" అని యాశ్చర్యంతో ఒక ఫ్రేమ్ కుర్చీలో కూలబడ్డాడు. ఓ పదినిముషాలైన తరువాత రికార్డు అవతల పడవేసి "మీ కాపురస్థలం ఏవూరు?" అన్నాడు అయ్యంగారు సాదరంగా. వాళ్లు అయ్యర్లు. మన

పూళ్ళపేర్లు వారికేం తెలిసేడుస్తాయి. మాది ఆంధ్రదేశం అని జవాబిస్తే సరిపోతుంది అనుకున్నాడుగాని శివనాధరావు సంభాషణ తెలుగుతోనే జరుపుతూండడంవల్ల మొత్తానికి యీాయన ఆంధ్రదేశంలో కొన్నాళ్ళు వున్నవాడులాగుంది అని "మాది కాపురస్థలం మచిలీపట్నం" అన్నాడు. "దాన్నే బందరు అనికూడా అంటారు గదూ!" అన్నాడు అయ్యాంగారు. శివనాధరావు అవునన్నట్లు తలవూపాడు; "నాకు ఆంధ్రులంటే అమిత అభిమానము. ఎక్కువప్రేమ. ఎందువల్లనంటే నాసగం జీవితమంతా ఆంధ్ర దేశంలోనే గడిచింది. మీాదేశంలోనే ముప్పై సంవత్సరాలు తహశీల్దారుపని చేశాను. తెనాలి, బెజవాడ, బందరు, గుంటూరు, ఆప్రాంతాల నాకు మంచిపేరువుంది. తెనాలిలో నేను పనిచుంచి రిటైరైవస్తూంటే ఆతాలూకాలోని కరణములు, మునసబులు, రెవిన్యూఇన్ స్పెక్టర్లు, కన్నీటి ధారలుకార్చారు. నాకింత వృద్ధాప్యం వచ్చినా చేతిలో ఏపనీలేకుండా నేను వుండలేను. అందువల్ల యీా బిజినస్ చేస్తున్నాను. మా ఆడవాళ్ళకు కూడా తెలుగు వాళ్ళంటే ఎక్కువప్రేమ. మా అమ్మాయికి అరవమే రాదు. తెలుగు సంగీతమూ, తెలుగు చదువూ, అన్నీ దానివి తెలుగు పద్ధతులే. యీాచుట్టుప్రక్కల యెక్కడా తెలుగు మాట్లాడే వాళ్ళు లేకపోవడంవల్ల మావాళ్ళు చాలాఅవస్థ పడుతున్నారు. మీాకు కుటుంబం వున్నదంటున్నారు గనుక మా యింట్లో కాపురముంటాని కేమీా అభ్యంతరంలేదు. ఇహ అద్దెమాట అంటారా? నెలకు ఆరురూపాయలివ్వండి. నేను

అద్దెకోసరం చూడటంలేదు. మావాళ్ళతో తెలుగు మాట్లాడే ఆడవాళ్ళు వస్తారుగదా అని జూస్తున్నాను......"

అయ్యంగారి మాటలు శివనాధరావుకి ఆశ్చర్యం కలుగ జేసినాయి. తనకు అంత పెద్దయిల్లు తక్కువ అద్దెకు లభించడం మహాభాగ్యం అనుకున్నాడు. అయ్యంగారితో ఆంధ్ర దేశ విషయాలు రెండు మూడు గంటలు మాట్లాడి చివరకు "రెండు మూడు రోజుల్లోవచ్చి ప్రవేసిస్తాం" అని చెప్పి శివనాధరావు యింటికొచ్చేశాడు. నీరజకు జరిగినదంతా చెప్పి "నీరజా! పదిరూపాయి లెవ్వి?" అన్నాడు. "పదిరూపాయలూ ఒక్క ముద్దుతో చెల్లు" అన్నది నీరజ శివనాధరావువంక వోరకంటజూస్తూ. "పోనీ, అదేచెల్లించుకో" అని నీరజను తన బాహువుల్లో యిరుకించుకుని ఒక్కముద్దు పెట్టుకున్నాడు.

... ... ...

శివనాధరావు మైలాపూర్‌లో వాసుదేవఅయ్యంగారింట ప్రవేసించి నాలుగు మాసములైనది. నీరజకు దగ్గూ, జ్వరమూ ఆరంభించినాయి. ఒక నెలరోజులు ఇంగ్లీషుడాక్టరు చేత మందిప్పించాడు శివనాధరావు. ఏమీ తిరుగు మొఖం కాన్పించలేదు జబ్బు. అదీగాక యిక్కడ నీరజకు చాకిరీ చేసేవా రెవ్వరూలేరు. ఆరోజు కారోజుకి నీరజ నీరసించి పోతోంది. నీరజను పుట్టింటికి బంపుటకు నిశ్చయించాడు. విధిలేక నీరజ పుట్టింటికి వెళ్ళింది. శివనాధరావుని అయ్యంగారి భార్య "భోజనం చేశారా" అని ఆదరంగా అడిగేది. శివనాధరావు ఆఫీసుకెళ్ళే సమయాల్లో అయ్యంగారి కుమార్తె

అంబాళు గదిలో కూర్చొని వీణ పాడుతూండేది. ఆమె కంఠస్వరం వినగానే, అతని హృదయంలోని ప్రేమరసం ఆమెవైపునకు ప్రవహించేది. వరండాలో ఎవరూ లేకుంటే కిటికీలోనుంచి తొంగిజూచి ఆమె ఎక్కడ జూస్తుందో అని గబగబ వెళ్ళిపోయేవాడు. ఎవరైనా వరండాలో వుంటే తలవంచుకుని వెళ్ళిపోయేవాడు. అతడు స్నానం చేయడానికి క్రిందిభాగంలోని దొడ్లోకి వచ్చినప్పుడు అంబాళ్ ఏదో ఒక పనినెపముమీద దొడ్లోకొచ్చి, అతనివంక వ్యారకంట జూస్తూ తన పెదవులపై చిరునవ్వును తాండవింపజేస్తూ అతని హృదయంలో మదనుడు తందనాలు త్రొక్కేటట్లుగా జేసి, చరచరా లోపలికెళ్ళి పోయేది. మదనుడ్ని రెండు చంపపెట్లువేసి అవతలకు పంపేద్దామని ఎంత ప్రయత్నం చేసినా, అతనికేమీ చేతయ్యేదికాదు. అతనిలోని వైరాగ్య మంతా వుపయోగించినా మదనుని కేమీ బుద్ధివుండేది కాదు. ఆమె కనపడినప్పుడు ఆమెవైపు చూడకుండా వుండాలని ఎంత ప్రయత్నించినా, ఏమీ లాభించేది గాదు. ఎంత తలవంచుకుని క్రిందవైపు చూచినా అతని, కండ్లు ఆటోమేటిక్‌గా ఆమె వైపునకు తిరిగేవి "నన్ను నీదానిగా జేసుకోవా?" అన్న ప్రార్థనాభావం స్ఫురించేది. ఆమె నేత్రములో, అంతకంటె నెక్కువ దైన్యభావము అతని నేత్రములలో స్ఫురించేది. శివనాధరావు ఆమె వివాహితఅని తెల్సుకున్న తర్వాత, ఆమెను మాతృదేవతగా భావించే భావాన్ని కలిగి వుండాలనుకున్నాడు. ప్రేమ దేవతగా ఏర్పడిపోయిన స్త్రీ,

మాతృదేవతగా ఎట్లు ఏర్పడగలదు? ప్రేమదేవత యైన స్త్రీ యందు మాతృభావ మెట్లు గలుగ గలదు.

ఆనాడు ఆదివారం కావడంచేత అఫీసుకు శలవు దినము. శివనాథరావుకు కాంగ్రెస్ అంటే ఎక్కువ అభిమానం. అదివరలో ఓ అయిదు సంవత్సరాలు కాంగ్రెస్ సేవ చేశాడు. 1920 వ సంవత్సరంలో గాంధి కంఠమెత్తి పిలువగానే హయ్యర్ ఎడ్యుకేషన్ మానివేసి, కాలేజీ నుంచి లేచివచ్చిన యువకుల్లో ఇతడుగూడా ఒకడు సత్యాగ్రహ సమరములో రెండు సంవత్సరాలు కఠిన శిక్ష అనుభవించాడు గూడాను. పిత్రార్జిత మంత అప్పుల వాళ్ళు వేసుకు పోవటంవల్ల ఒక పెద్ద ఫరమ్‌లో వుద్యోగిగా కుదిరాడు. ఉద్యోగంలో ప్రవేసించిన యీ నాలుగు సంవత్సరాల నుంచి, తీరిక వున్నప్పుడు కాంగ్రెసుకు సంబంధించిన పుస్తకాలు చదవటంతోనే తాను కాంగ్రెసుకు చేసే సేవను ముగిస్తున్నాడు. ఆ నాడు తీరికగానే వుండడంవల్ల వందే మాతరాన్ని జూస్తూ కుర్చున్నాడు. రెండు పేజీలు ఏ అడ్డు లేకుండా జూడగలిగాడు. ఆ గీతాల్లో తన్మయుడై తన కొచ్చిన కొద్ది సంగీతాన్ని వుపయోగిస్తున్నాడు. అలా తన్మయుడైన శివనాథరావు అకాత్తుగా ఆపివేసి చెవులొగ్గి ఏదో ఆలోచించడం మొదలు పెట్టాడు. అంబాళ్ వీణపాట అతని హృదయంలో ప్రేమరసాన్ని రేకెత్తించింది. లండన్ గోల్డు ఫ్లేగ్ సిగరెట్టు ఒకటి ముట్టించి మెల్లగా మెట్లు దిగి అంబాళ్ గది కిటికీలో నుంచి తొంగి చూచాడు! ఆమెను జూడడం

ఈ సారి రెండు నిమిషాలు పట్టింది. అంబాళ్ చూడలేదు గాని ఆతడ్ని అంబాళ్ తల్లి చూసింది. పూర్తిగా ముఖం కన్పించలేదు. తలమాత్రం కనుపించింది. "ఎవరు వారు" అంది అంబాళ్ తల్లి రాజంబాళ్. శివనాధరావు బెదురుతూ మెట్లు ఎక్కుతున్నాడు. జవాబేమీ రానందున రాజంబాళ్ తలుపు తీసికొని బయటికివచ్చి, బెదురు చూపులతో మెట్లు ఎక్కుతున్న శివనాధరావును జూచి "శివనాధరావుగారూ! మీరా యిప్పుడు తొంగిచూచినది, లోపలికిరండి. మమ్మల్నిజూస్తే నీకు భయమెందుకు నాయనా. మీ యిల్లే మా యిల్లు; మా యిల్లే మీ యిల్లు" అంది ప్రేమాస్పదంగా. "ఎవరో పాడుతున్నట్లు వుంటేను చూచాను. కొంచెం తొందర పని వున్నది వెళ్ళాలి. రానందుకు క్షమించండి" అంటూ పైకి వెళ్ళిపోయాడు. ఈజీచైర్‌లో కూలబడి కండ్లు మూసుకు న్నాడు నిద్ర వస్తుందేమోనని. ఆనిద్రాదేవతగూడా ఆతని యెడల కాఠిన్యం వహించింది. ఇహ ఇక్కడుంటే మనశ్శాంతి ఉండదని స్టాండున తగిలింపబడియున్న బెంగాలీలాల్చీ ధరించి బ్రాడ్వేలో ఒక ఫ్రెండు ఇంటికి వెళ్ళాడు. ఆఫ్రెండుతో ఎన్ని విషయాలమీద బాతాఖానీకొట్టినా, మనశ్శాంతి యేమీ కుదరలా. అక్కడనుంచి రాయల్‌హోటలుకి, అక్కడ నుంచి పార్క్మెలన్‌డ్యాన్సుకు, యింకా కొన్నికొన్ని వినోద ప్రదర్శనములకు వెళ్లి సాయంకాలం నాలుగుగంటలకు చైనా బజారులో చిరకాలమునకు ఒకప్రాణస్నేహితుడు కన్పించాడు. క్షేమ సమాచారములను గూర్చి బాతాఖానీ కొట్టుకుంటూ

బీచికెళ్ళారు. శివనాధరావు ఆస్నేహితునితో మాట్లాడుతున్నా డన్నమాటయేగాని, యేమిమాట్లాడుతూన్నది గూడా అత నికి తెలియడంలేదు. చల్లగాలి ఆతని హృదయంలోని కలవ రాన్ని యింకా యెక్కువజేస్తోంది. అల్లాగే చీకటిపడేవరకూ మాట్లాడుకుని యిద్దరూ పారగాన్ టాకీస్‌లోని అమృతమంధన్ అనే హిందీ టాకీకి వెళ్ళారు ఇద్దరూ బాల్కన్‌లోకి వెళ్ళారు. ఆట ప్రారంభించి ఒక పావుగంటయైనా కాకముందే, శివనాధ రావు ఆస్నేహితుడితో తొందరపని వున్నదనిచెప్పి ఇంటి కొచ్చేశాడు. గేటువద్దకు వచ్చేసరికి అంబాళు వీణపాట విన బడింది. ఇందాక రాజంబాళు యిచ్చిన యవకాశమును ఉప యోగించుకొని యంబాళ్ గదిలో కెళ్ళాడు- అంబాళ్ మర్యాదగా "కూర్చోండి" అన్నది ఒక ఫ్రెంచైర్‌ని తనచేత్తో చూపిస్తూ. ఆమాట ఆకర్షణ, సొంపు, వయ్యారమూ ఆతని వేదనను మరీ యెక్కువజేసినాయి. అంబాళ్ వీణయందు దృష్టినిలిపి పాడుతూన్నప్పుడు ఆమెవంక విసుగూ విరామం లేకుండా కన్నార్పగుండా జూచేవాడు. ఆమె తనవైపు దృష్టిని ప్రసరింపజేసినప్పుడు వెంటనే తల వంచేసేవాడు. ఒక యర గంట యయినతర్వాత "వెళ్ళివస్తానండి" యన్నాడు కుర్చీమీద నుంచిలేస్తూ. "ఇవ్వాళ ఉత్సాహంగాలేరేం? యేమయినా సుస్తీగా వుందా" యన్నది రాజంబాళ్. "ఏంలేదండి" అంటూ ముసిముసినవ్వులు నవ్వుకుంటూ మేడ యెక్కాడు. శివనాధ రావు కొరకై నిరీక్షిస్తూకూర్చున్న ప్యూన్ "అయ్యా! హోటలునుంచి టిఫెన్ క్యారీర్ తెచ్చాను" అంటూ మేడదిగి వెళ్ళి

పోయాడు. శివనాధరావుకి భోజనంమీద యంతగా యిష్టం పుట్టలేదు. లోపలికి వెళ్లకుండానే మెల్లాలోనున్న క్యాంపు కాట్ మీద మేనువాల్చాడు.

... ... ...

ఆమర్నాటి వుదయాన ఆరుగంటలకు నిద్రలేచి స్నానము కొరకు క్రిందకు వచ్చాడు. పైపు దగ్గర అంబాళ్ నిలవబడి వుంది. శివనాధరావు ఎక్కడా ఆగకుండా సరాసరి పైపుదగ్గర కెళ్ళాడు. అంబాళ్ కొంచెము ప్రక్కకు తప్పుకుంది. వారిద్దరి చూపులు ఒక్కటైనాయి. వారిద్దరి హృదయాలూ ఒక్కటై నాయి. వారిద్దరి శరీరాలు ఒకరిచేతుల్లో ఒకరివి యిమిడిపోయి నాయి. ఆమె తన గానమాధుర్య హృదయాన్ని యతనికి పూర్తిగా అర్పించింది. అతడు తన కవితాహృదయాన్ని ఆమె కర్పించాడు. గానమునకూ, కవిత్వమునకూ పొందు కుదిరాయి అతడు భావగీతాల్ని వ్రాస్తుంటే, వాటిని ఆమె వీణమీద గానంచేసేది! ఆమె గానమునకు అతడు పరవశుడై లెక్కలేనన్ని గీతాలు వ్రాశాడు. ఈ విధంగా ఆనందంగా ఒక నెలరోజులు గడిపారు. నీరజవచ్చింది. వారి ఆనందము నకు భంగం కలిగింది. ఒకప్పుడు, ఒక్కటిగానున్న వారి హృద యాలకు, యీ నాడు నోటిమాటలకు కూడా యవకాశం లేకపోయింది. శివనాధరావు ఇదివరలో జూపినంత ప్రేమ, నీరజయందు యిప్పుడు జూపటంలేదు. శివనాధరావు నడత నీరజకేమీ అర్థం కావడంలేదు. నీరజ, అతడ్ని యడుగుదా మనుకుంది గూడాను. కాని ఆమెకు ధైర్యము చాలలేదు.

శివనాథరావు, నీరజతో ఎక్కువగా మాట్లాడడం మాని వేశాడు.

నీరజకూ, రాజంబాళ్‌కూ తెలియని యీ విషయం వాసుదేవ అయ్యంగారికి ఎలాగో తెలిసింది. ఏదో కారణం చెప్పి శివనాథరావుతో ఖాళీజేయమని చెప్పేశాడు !

శివనాథరావు, ఇల్లు ఖాళీజేసి, బండి యెక్కుతూంటే అంబాళ్ ఆతనిపంక అమిత దీనంగాచూస్తూ వరండాలో నిలబడ్డది.



# 3. భవాని

భవానికీ, నాకూ ఎంత ఎఠాత్తుగానూ ఎంత అప్రయత్నంగానూ ప్రణయసంబంధం కూడిందో, అంత హఠాత్తుగానూ, అంత అప్రయత్నంగానూ మా ప్రణయ సంబంధం తీరింది. ఆమెచరిత్ర నాకు తెలియదు సరికదా; ఆమె మొహాన్ని గూడా నేను ఎప్పుడూ చూడలేదు. ఏదో ఒక పెనుగాలికి ఒకనగరంలోని పక్షి అరణ్యాలోకివచ్చి ఆఅరణ్యంలో ఎల్లప్పుడూ నివసించు నింకొకపక్షిని కలుసుకుంది. అవి రెండూ ఆఅరణ్యంలో కొన్నాళ్లు ఒకేగూడులో కలిసివున్నాయి; మళ్ళీ ఏదో పెనుగాలికి ఆరెండుపక్షులూ విడబడినాయి. అంతే మా ఇద్దరి ప్రణయసంబంధమూనూ—

అది బహుశః మార్చినెల అయివుండవచ్చు. నెల సంగతి నాకంత యెక్కువగా జ్ఞాపకంలేదు. ఆరోజున తారీఖు పదిహేను అనినాకు బాగా జ్ఞాపకం. ఎండలు ఇంకా ఎక్కువగా ముదరలేదు. మొత్తానికి వడగాలి వేస్తూనేవుంది. పరీక్షదినాలు సమీపించినాయి. ఆరోజున, వుదయం పదిగంటలకు హోటలునుంచి భోజనం తీసుకునివచ్చినప్పటినుంచీ, సాయంత్రం మూడున్నరగంటలవరకూ ఒకేమాదిరిగా (యీమధ్య నిద్రాభంగము లేకుండా) నిద్రబోయాను. అప్పుడు, నన్నుఎవరో కొట్టి లేపినట్లు నిద్ర మెలకువవచ్చింది. నేను కండ్లు మూతలు విప్పడమూ, గోడనున్నగడియారం అరగంట కొట్టడమూ ఒకేసారి జరిగినాయి. మెల్లగా క్యాంపుకాట్ మీదనుంచి లేచి

కూజాలోని నీటితో మొహంకడుక్కొని, గబగబ తలదువ్వు కుని, సూటేసుకుని కాఫీక్లబ్బునకు బయలుదేరాను. కాఫీక్లబ్బులో ఒక అర్ధపావుశేరా వెచ్చించి, ఆకలితో ఘోషిస్తూన్న ఆత్మను కొంతవరకు తృప్తిపరచి, ఒకఅరగంటలో, తిరిగి నారూముకు చేరుకున్నా. పరీక్షల సంగతి నాహృదయంలో ప్రతిధ్వనిం చింది. ఆపరీక్షల్లో విజయముగాంచినయెడల నేను మామయ్యా వల్ల పడేబాధలన్నీ నాకంట గట్టెనట్లయినాయి. వెంటనే, కోటూ, షర్టూ తీసి స్టాండుకు తగిలించి మేజామీదనున్న "Macaullay's Essays on Warren Hastings" తీసుకుని బయటదొడ్లోనున్న యీజీచైరులో కూలబడ్డాను. కొంచెం ఎండనీడవున్నప్పటికీ, వేడిగాలి బాగాతగ్గింది. మంద మారుతం చల్లగావీస్తోంది. ఒకఅరగంట చదివిన తర్వాత నాకు కొంచెం విసుగుగలిగింది. ఆదొడ్డిలో ఒకమూల గుబు రుగా గులాబివృక్షాలున్నాయి. ఆచెట్లనిండా పూలు అరబోసి నట్లున్నాయి. ఆ సువాసన దొడ్డి అంతా ఘుమాయిస్తోంది. ఆదృశ్యం నామనస్సు కాహ్లాదమిచ్చింది. వెంటనే లేచి గులాబీ వృక్షాలదగ్గరకు వెళ్ళాను. నక్షత్రములమధ్య చం ద్రుడులాగా, ఆపూవులన్నిటిమధ్యనున్న ఒకపెద్దపూవును త్రుంపి, ముక్కుదగ్గర పెట్టుకుని దానిపరిమళాన్ని ఆఘ్రాణి స్తూన్నాను. ఇంతలో తలుపు చప్పుడూ, దాని వెంటనే పెద్ద ఏడుపూ వినబడ్డది. వెంటనేపరుగెత్తి బయటితలుపు తీశాను. నేను తలుపులు తీసినదే తడవుగా, ఒక స్త్రీ వ్యక్తి లోపలికి వచ్చి పెద్దగా ఏడుస్తూ నా రెండుచేతులూ బట్టుకుని తడబడు

తూన్న కంఠంతో "అయ్యా !......నన్ను రక్షించండి... అదుగో! ఆయమకింకరుల బారినుండి రక్షించండి......... బాబూ!...ఏ దిక్కూలేని యీ ఏ కాకిని అసురాగ్రాదుల బారి నుండి..." యీ మాటలు మాత్రం నిముసానికి ఒక్కమాట చొప్పున చెప్పింది. పెద్ద పెట్టున యేడుస్తున్నా గూడా ఆమె మొఖం అందంగానే వుంది. ఆమెలో యౌవనశోభ తొనికిస లాడుతోంది. ఆమె పచ్చని ముఖంమీద నల్లగా నిగనిగలాడే కురులు నాట్యం జేస్తూన్నాయి. నేను ఆ సంధ్యాసమయంలో ప్రతిమలాగా చైతన్య రహితమై రెప్ప వాల్చకుండా ఆమె వంకే చూస్తూండి పోయాను. నాలోని జీవశక్తి 'చూస్తూ వూరుకుంటావేం ? ఆమె సౌందర్యరసాన్ని గ్రోలేసమయం యిదికాదు. ముందు ఆమెను విపత్తునుండి తప్పించు' అని నన్ను మేల్కొల్పినట్లుంది. ఈ చిత్ర విషయమంతా నా కరం గాకపోయినా, "మీరిక్కడే వుండండి. మిమ్మల్ని రక్షించు టకు, నా ప్రాణత్యాగం అవసరమైననూ, నేను ఆ వుద్య మాన్ని మానను" అని ఆమెను లోపలికి వెళ్ళమని గదిజూపి, ఆమె ఆ గదిలోకి వెళ్ళినతర్వాత తాళంవేసి ఏమీ ఎరుగనట్లు కండ్లు నలుపుకుంటూ వీధిద్వారం దగ్గఱ నిలబడ్డాను. రెండు నిముసాల్లో ఓ వందమంది జనం మా వాకిట్లో కూడారు. ఆ గుంపు మధ్యలోనుంచి, యాభైఏళ్ళ ముసలాయన ముందుకు వచ్చి కండ్లు వురుముతూ గంభీరంగా "భవాని యేదీ ?" అన్నాడు. "భవాని యెవరు" అన్నాను నేను అమాయ కత్వంగా. "ఆం. యెరగనంటున్నావ్ ! నాలుగైదు నిముసాల

క్రింద ఒక ఆడపిల్ల యీ ఇంట్లోకి పరువులెత్తినే! అన్నాడా ముసలాయన, నా అమాయకత్వాన్ని ఆధారంగా జేసుకుని యింకా కొంచెం గంభీరంగా." "నా ఇంట్లోకి ఎవ్వరూ రాలేదు. అనవసరంగా వాగక ముందు నడవండి" అన్నాను నేనుగూడా ఆయనపద్ధతే అవలంబించి. "ఎవరయ్యా నీవు ? నా పెళ్ళాన్ని నీ ఇంట్లో దాచి, యింకా ధాష్టీకాలు చేస్తావు" అన్నాడు పెద్ద కంఠధ్వనితో. అప్పటికి నాకు కొన్ని ముఖ్యాంశాలు అర్థమైనవి. ఆయనపోరాటాన్ని నేనేమీ లక్ష్యపెట్టలేదు. భయాన లాభంలేకపోయింది. ఇక నయాన మొదలెట్టాడు: "అబ్బాయీ! ఆమె నామూడవ పెండ్లిభార్య. చిన్నపిల్ల గనుక కొంటెతనంచేసి నాస్వాధీనం కావడంలేదు. అందువల్ల నేను రెండు దెబ్బలువేసి, బలవంతాన స్వాధీనం చేసుకుంటూండగా, బయారున పడ్డది. కనుక నాయందు దయయుంచి ఆమెను బయటికి తరిమివెయ్యి. లేకపోతే నాకాపరాన్ని ధ్వంసం చేసిన వాడవవుతావు" అని యింకా ఏమేమో బ్రతిమాలడం మొదలెట్టాడు. "మీరు ఎన్నిజెప్పినా లాభంలేదు. మీకామదాహానికి ఆపిల్ల చాలదు. మీకామదాహాన్ని తీర్చేశక్తి ఆమెలో లేదు. అందువల్ల ఆమె కొంచెం భయం చెందినదేమో! అంతమాత్రాన, ఆపిల్లమీదపడి మీరు బలవంతంగా చెఱచడం ఏమీ న్యాయంగాలేదు......" అని యింకా నేను చెపుతూండగా ఆజనంలోనించి పెద్ద పెద్ద కంఠధ్వనులతో యీమాటలు వినబడ్డాయి "ఆయన పెళ్లాన్ని ఇంట్లో దాచి, యింకా ఏవేమో నీతులు గరుపుతావేమిటయ్యా?"

మరునిముషంలో నామీద యిద్దరు ముగ్గురు కలియబడ్డారు. నేను వారిబలాన్ని సరిలెక్క చేయలేదు. కాని వారివల్ల నాకు బలమైన గాయములు తగిలాయి. అప్పటికీ నాపట్టుదలను వీడ లేదు. ఆముసలాయన, ఆవందమందిజనం నారూమ్‌దగ్గఱనుంచి వెళ్లిపోయారు. వెళుతూ ఆముసలాయన నాకు తన కుడిచేతి బొటనవ్రేలును చూపించి "ఇదంతా నీకొంపకూలడానికే వచ్చింది. కోర్టు ఏమైందనుకున్నావ్!" అన్నాడు. వాళ్లు వెళ్లిన తర్వాత లోపలికివెళ్లి రూముకు తాళం తీశాను. ఆ అబల పెద వులమీద చిరునవ్వు తాండవమాడుతోంది. "పాపం! మీకు తగిలిన బలమైనగాయాలకు కారణము నేనేకదా! వాళ్ళు వెళ్ళిపోయారా? వున్నారా" అంది. "వాళ్లు వెళ్ళిపోయారు. నీకేమీ ఫరవాలేదు. నీకు ఇష్టమైనన్ని రోజులు నిర్భయంగా వుండొచ్చు" అన్నాను. రెండు మూడు రోజులవఱకూ ఆమెకూ, నాకూ, అంత యెక్కువగా పరిచయం ఏర్పడలేదు. రెండుపూటలా, హోటలునుంచి టిఫెన్‌తో మీల్సు తీసు కొచ్చేవాడ్ని. గదిని ఏపూట కాపూట వూడవడమూ, ప్రతి రోజు వుదయాన కడగడమూ, మురికిచెత్తకు నివాసమైన నా గది, ఆమె వచ్చినతర్వాత శుభ్రపడింది. సాయంత్రం నాలు గంటలయ్యేసరికల్లా వాల్జడ వేసుకుని గులాబి పూలెట్టుకుని రంభలాగా తయారయ్యేది. ఆరెండు మూడు రోజుల్లోనూ, ఆమెయందు నేను ఏవిధమైన కృత్రిమభావముతోనూ వుండ లేదు. నాదృష్టిలో ఆమె 'దీనురాలు' అనిమాత్రమే. ఆమెను రక్షించడమే నాముఖ్యవిధియని నావుద్దేశ్యము. "రక్షించండి"

అని ఏడుస్తూ ఆమె పల్కినమాట నాహృదయంలో, 'ఖంగు' మని ప్రతిధ్వనిస్తోంది. ఆ రెండుమూడు రోజుల్లోనూ ఆమెను, నేను "ఏమండి" అనిపిలవడం, నన్ను ఆమె "ఏమండి" అని పిలవడం జరుగుతూండేది. నామామూలు దినచర్యలో మాత్ర మేమీ మార్పు కలుగలేదు. నేను రోజూ ఆమెకోసకు ఏవేవో పత్రికలు తెచ్చి మేజామీద పడేశావాడ్ని. అవి తన కోసకే తేబడ్డాయని అర్థంచేసుకుని వాటిని జదువుతూ కాల క్షేపం జేసేది. ఆ రెండుమూడు రోజుల్లోనూ ఆముసలివాడు గానీ, ఆజనంగానీ, ఎవ్వరూ రాలేదు. ఆమెను యీచిత్ర కథంతా అడుగుదామని నాకు బుద్ధికలగలేదు. ఆమె నాతో చెప్పనూలేదు. ఒక గదిలో యిద్దరు క్లాసుమేట్సు వున్నట్లు గానే, మేమిద్దఱమూ ఆగదిలో వుంటున్నాం.

అప్పటికి ఆ స్త్రీవ్యక్తి నారూముకు వచ్చి నాలుగు దినాలైంది. రెండోసారి మీల్సుతీసుకుని, టిఫెన్ క్యారేజితో సహా హోటలునుంచి రూముకు వచ్చాను. ఆమె కాన్పించ లేదు. బయటి దొడ్డిలోకి వచ్చాను. ఆమె క్యాంపుకాట్ మీద పడుకునివుంది. "ఏమండీ! టిఫెన్ క్యారేజి తెచ్చాను" అన్నాను. గభాలునలేచి వచ్చి నాచేతిలోని క్యారేజి తీసుకుంటూ "నన్ను ఏమండి అని పిలవనక్కర్లేదు. 'భవానీ' అని పిలవండి. మీరు ఆముసలాడి నుండి నాప్రాణాన్ని రక్షించారు కనుక ప్రాణదాత యగు మీరు అలా పిలవగూడదు" అని నవ్వుతూ చరచర లోపలికి నడిచి వెళ్ళింది. నేను రెండో లాంతరు వెలిగించుకుని హిస్టరీ నోట్సుతీసుకుని దొడ్లోకి వెళ్లేసరికల్లా

క్యాంపు కాట్ మీద భవాని పక్కగుడ్డలు పరుస్తోంది. "ఎందుకండీ మీకీ శ్రమ" అన్నాను. కొంచెం దూరంగా నిలబడి చిన్నగా నవ్వుతూ "మీరు నా కొఱకై చేసిన శ్రమలో యిది ఎన్నోవంతు ? ఇదొక శ్రమయా ?..." అంటూ లోపలికెళ్లింది. అలారం టైంపీసు చిన్న మేజా మీద పెట్టి, క్యాంపుకాట్ మీద నడుం వాల్చి నోట్సు తెరిచాను. అసలే నాకు హిస్టరీ చదవడమంటే మహాసరదా. అందులో చరిత్రయందు ఇష్టంలేని స్టూడెంట్సుకు కూడా యిష్టం గొలిపే 'నెపోలియన్ వారు' చదువుతున్నా. నెపోలియన్ ధైర్యసాహసాల్ని మెచ్చుకుంటూ అమితోత్సాహంతో చదువుతున్నా. భవాని క్యాంపుకాట్‌ను నాదగ్గఱగా యీడ్చుకుని పడుకున్నది. ఆమె నావంక కన్నార్పకుండా చూడడం, నేను ఓరకంట చూస్తూనే వున్నాను. ఆమూడు రోజుల్నుంచీ లేని ఒక విధమైన మార్పు, ఆనాడు ఆమెలో కన్పించింది. నెపోలియన్ వార్ చదవడమైన తర్వాత కళ్ళు మంటలుగా వుండడంవల్ల, పుస్తకం చిన్న మేజామీదకు గిరాటువేసి కళ్లు మూశాను. ఒక అరగంటయైనా సరిగా నిద్రబోయానో, లేదో, నాకు మెలకువ వచ్చింది. కనురెప్పలు విడబడినాయి. ...నా జన్మలో ఎన్నడూ చూడని ఒక అపూర్వమైన దృశ్యం ...ఎన్నడూ అనుకోని ప్రణయం...నా కండ్లను నేనే నమ్మలేక బోయాను. భవాని ముఖం, నా ముఖం మీద వుంది. నా బుగ్గలు ముద్దులలో......

ఆ రోజున ఆమెతో చాలా సౌఖ్యం అనుభవించాను.

ఆ రోజుతో నా బ్రహ్మచర్యం సమాప్తి. మర్నాటినుంచీ మే మిద్దరయీా భార్యాభర్తల్లాగావుండి పోయాం. భార్యా యం దుండవలసిన లక్షణాలు ఆమెయందునూ, భర్త యందుండ వలసిన లక్షణాలు నా యందునూ ఆవిర్భవించాయి. కాని యీా విషయం సంఘదృష్టిలో గాదు, మా ఇద్దరిలో మాత్రమే. మే మిరువురమూ భార్యాభర్తలం. సంఘదృష్టిలో ఆమె లంజ. ప్రేమకు స్వేచ్ఛ యిచ్చే మా యిద్దరి న్యాయదృష్టిలో నేను భర్త, ఆమె భార్య.

వూరంతా యీా సంగతి వ్యాపించింది. 'ఫలానివాడి భార్య......ఫలానివాడితో...' అన్నమాటే ప్రతివాళ్ళ నోట్లోనూ. ఒకనాడు కొంతమంది (శ్రీమంతులే అనుకుం టాను) నేను బజారున వెళుతూంటే నన్ను పిలచారు. దగ్గఱ కెళ్లాను. "తహసీల్దారుగారి భార్యను లేవతీసుకెళ్లావటే. నీకు ఉంపుడుకత్తె కావలెరా" అన్నాడు అందులో ఒకడు యెగ తాళిగా నవ్వుతూ. వాడు నవ్వినందుకు నాకు కోపంరాలేదు. వాడి మాటలు నా హృదయముమధ్య శూలములై గుచ్చు కున్నాయి. "ఆమె నాకు ఉంపుడు కత్తెగాదు. నాభార్య." వాళ్ళందరూ పెద్దపెట్టున నవ్వారు. వీడికేదో పిచ్చి పుట్టిం దిరా. ఎవడి భార్యనో, నాభార్య అని అంటాడు. "నీవు ఆ అమ్మాయిని పదిమంది సమక్షాన వివాహమాడావా? ఎందుకు గాని, ఆ అమ్మాయిని ఆమె మొగుడి దగ్గఱకు వెళ్ళమను. ఆయన తల్చుకుంటే నిన్ను ఏపనైనా, చేయించగలడు. ముందెప్పుడో జరిగే శాస్తివఱకూ యెందుకు? నీమీాద

ప్రిన్సిపాల్ కు రిపోర్టుపోయి చాలరోజులైంది. రేపు పరీక్షలకు నిన్ను రానీయడు. ఇప్పటికైనా బుద్ధి తెచ్చుకుని ఆ అమ్మాయిని ఆయన యింటికి పంపి, ఆయన కాళ్ళమీదపడి క్షమార్పణకోరు. లేకపోతే నీపని అన్ని విధాలా..."అని వాళ్ళక్కడనుంచి వెళ్ళిపోయారు. ఏపరీక్షల కోసమైతే పగలు రాత్రి యనక ఎల్లవేళలా తదేక చిత్తంతో చదువుతున్నానో, ఏ పరీక్షలకోసమైతే నా తండ్రిని పీడించి ధనమంతా వ్యయపరుస్తున్నానో, ఆపరీక్షలకు వెళ్ళేందుకు నాకు వీలులేదు. నేను పిచ్చివాడిలాగా, మనస్సు తిన్నగా లేకుండా, యింటికివచ్చా. ద్వారం దగ్గఱనే ఉగ్రుడైన మానాన్నగారు ప్రత్యక్షం. నన్ను జూడగానే ఆయనకళ్లు అగ్నికణములలాగా ఎఱ్ఱనయినాయి. "ఎవరురా, ఆజడ వేసుకుంటూన్న అమ్మాయి?" అన్నాడు వస్తూన్న కోపాన్ని అపుకుంటూ.

"..............."

"ఎంత అప్రతిష్ఠ! ఎంత అపకీర్తి! నాకడుపున చెడబుట్టావే? ఇదేనా నీచదువు"

"..............."

ఈ సంగతి విన్నప్పటినుంచీ మా అమ్మ ఒకే తీరుగా ఏడుస్తోంది.

నా మాతృదేవి దుఃఖం నాకు కొంచెం విచారం కలిగించింది గాని, అంతకంటె నల్లభై రెట్లు దుఃఖాన్ని ఆముసలి భర్తవల్ల బొందుతూన్న భవాని రక్షణము తలపుకొచ్చే సరికి ఆవిచారం మటుమాయమైంది.

'తహసీల్దారు నీమీద కోర్టులో అభియోగం తెచ్చాడు. నీకు యివ్వాళో, రేపో, కోర్టువారు తెలియ పరుస్తారు. ఆ అమ్మాయి యిందువల్ల పడే బాధేమీ లేదు. నీకే రెండు మూడు సంవత్సరాల శిక్ష పడుతుంది. అదీగాక, ఆమె నాయుడుబిడ్డ. (నాయుళ్ళకులం) ముఖ్యంగా యీవిషయాన్ని గూర్చి మనవూళ్లో ఆందోళనగావుంది. నిన్ను ఇంట్లోకి రానిచ్చితిరో ఇంటిల్లిపాటిక వెలిబెట్టేటట్లున్నారు. వూళ్లో వాళ్లు వీధిగుమ్మం దాటితే సరి, నన్ను దుయ్యబట్టు కుంటున్నారు. నీవేదో, పెద్దగా చదువుకుని మాఇద్దర్నీ వుద్ధరిస్తావని మాకెన్నాళ్ళనుంచో వున్న ఆశను నిరాశ చేశావు. ఇప్పటికైనా నామాటవిని నీవు, ఆ అమ్మాయిని ఆయన యింటికి పంపి, ఆయన కాళ్ళమీదపడి క్షమార్పణకోరి, వెంటనే ఇంటికిజేరి ప్రాయశ్చిత్తం చేసుకో. ఇక యీ చదువూ వొద్దు, యీ పట్నవాసమూ వొద్దు. ఈ రెండే నిన్ను యీ దౌర్భాగ్య స్థితిలోకి దించాయి...... ఏం ? మాట్లాడవు! ఏమంటావ్!"

సంఘంయొక్క తుపాకీ గుండ్లకు నేను అన్ని విధాలా గురియైనాను. అందువల్లనే నాతండ్రి నాకు నీతి గరుపుటకు వచ్చాడు. కాని ఏం ప్రయోజనం! దుర్భరమైన సంఘ వ్యవస్థను యెదుర్కొన దలచు చున్న నాకు, ఆనీతు లేవీ రుచింపలేదు.

"ఏరా? అలా మాట్లాడకుండా బెల్లం కొట్టినరాయిలాగా ఆకాశాన్ని చూస్తూ కూర్చుంటావ్!" అన్నాడు విసుగ్గా.

"నేను యీ వుద్యమంవల్ల సంఘంలో ఎంతనీచం గానూ, ఎంత దుర్మార్గంగానూ పరిగణింపబడ్డా సరే, సంఘం నామీద ఎంత భయంకర దృష్టిని బరపినా సరే, ఆపిల్ల తన యిష్టమై వెళతానంటేతప్ప, ఆమెను నేను బలవంతంగా తరిమి వెయ్యడం మాత్రం కలలోనివార్త" అని నేను ఖండితంగా చెప్పేశా. ఆయన నామీద ఎంతో కోపం చూపాడు. శాప నార్థాలు పెట్టాడు. చివరికి "చెట్టు చెడేకాలానికి కుక్కమూతి పిందెలు. నీతో నాకూ, నాతో నీకూ, యీరోజునుంచీ ఏమీ పని లేదు. ఈరోజు లగాయతు దమ్మిడీ పంపిస్తే ఒట్టు. నీవు నాకు కొడుకువూగాదు, నేను నీకు తండ్రినీ గాదు. ఉన్న ఆస్తి అంతా నా స్వార్జితం. అందులో నీకు భాగంకూడా పెట్టను. నీవు ఎల్లా చచ్చినా సరే......"అని గముఖీలు వేస్తూ వెళ్ళిపోయాడు. లోపల జడవేసుకొంటూన్న భవాని ఈ సంఘర్షణంతా విన్నది. మానాన్న లేచిపోగానే, నేను లోపలికి వెళ్లాను. "నావల్ల మీరు యెన్నోకష్టా లనుభవింప బోతున్నారు. మీ ఆనందమైన జీవితంలో నేనొక మాయ దారిదాన్ని అడ్డుపడి, మిమ్మల్ని అనేక కష్టాలకు గురిచేస్తు న్నాను. మీరు ఎందుకు నాకొరకు జీవితాన్నంతా అధో మయంగా జేసుకుంటారు? నాకు సెలవు యివ్వండి. ఏనది కైనా దారి చూసుకుంటాను. (అధికోద్రేకంతో) కాని, ఆ ముసలిభర్త దగ్గఱకు వెళ్ళి, వాడి కామ దాహానికి నేను గురి కాలేను. నా పవిత్రమైన శరీరాన్ని యింతమంది భార్యలతో (భార్యలిద్దరు యింకా పరాయి స్త్రీ లెందరో) ప్రేమను నటిం

చిన ఆ కళంకపు హృదయానికి మాత్రం అర్పించను. పవిత్రం గానూ, నిర్మలంగానూ ప్రవహించే ఆ కృష్ణానదీ జలంలో శరీరాన్ని వదిలేసి నా ఆత్మను పవిత్రం చేసుకుంటా. నన్ను మరణింపనియ్యి. అడ్డంకులేమీ పెట్టవద్దు. బ్రతికివుండి నేను కష్టాలు అనుభవించడమే గాకుండా, ఒక యువకుని యొక్క ఆనందమయ జీవితాన్ని, దుర్భరకష్టమయ జీవితంగా మార్చిన దాన్ని కాగలను. ఇప్పటికేమైంది? ఈకష్టాలు, 'ముందు అనుభవించే కష్టాలలో యెన్నియవ వంతు? ముందున్నది ముసళ్ళ పండుగ' అన్నట్లు మన యిరువురి జీవితముల భావిదశలు కష్టములతో నిండివున్నవి. ఈ సంఘం మన యిరువురినీ బ్రతుకనీయదు. మనము అనుభవించే సౌఖ్యాన్ని యెన్నాళ్లో నిలవనీయదు యీ సంఘం......" ఇక భవాని నోటనుండి మాటరాలేదు. ఆమె బుగ్గలమీదుగా కండ్లనుండి జలకణములు ఒకటి వెనుక ఒకటిరాలుతూన్నాయి. పద్నాలుగేండ్ల పిల్లకట; యాభైఏండ్ల మొగుడట; యౌవనశోభతో తొణికిసలాడుతూన్న నవయౌవన యువతికి, జుట్టు పూర్తిగా నెరసి పండ్లు వూడిపోయి శరీరము ముడతలుపడి, ప్రేమ నశించి పోయిన ముసలివాడు భర్త! ఆముసలివానిని ఆయువతి ఒల్లనం టేను......ఇంత గంద్రగోళమూను ... ఇంత భాగవతమూను...ఇంత మాత్రాన ఆమె లంజా......నన్ను ప్రేమించిన యువతికి నా హృదయ మర్పిస్తే... నేను వ్యభిచారిని... ఇదీ సంఘదృష్టి! భవానిని ఓదార్చి ఆమె కంఠంచుట్టూ నా రెండు చేతులూ పోనిచ్చి... ...........అప్పుడు ఆమెకు,

ఆదుఃఖమంతా యేమయిందో! ఎనలేని సంతోషం! "భవాని! చూచావ్! సృష్టిరహస్యం! ఒక నిముసముక్రింద మితిలేని సంతోషం! అంతే జీవితంలోని ప్రతిఘట్టమూ. ఒక నిముసము సంతోషం; ఒక నిముసము దుఃఖం" ఆ మర్నాటిరాత్రి భవాని చచ్చి పడివుంది దొడ్లో ఒకమూల.........ఆమె సంఘమునకు బలి.

# 4. కన్నీటి కెరటాలు

త్రేహాశ్శీల్లారు నారాయణరావు పంతులుగారి ఇంట్లో ఆయన రెండవకుమార్తె వివాహం యింకా నాలుగురోజులుంది. కొందరు బంధువులు పెండ్లికి పిలిచిందే చాలుకదా అని పదిరోజులు ముందే వచ్చికూర్చున్నారు. కొందరు బంధువులు ఆరోజునే బండ్లు దిగుతూన్నారు. నారాయణరావు కుమారుడు మురళి తమవాకిట్లో బండ్లలోనుంచి దిగే చుట్టాల్నిజూస్తూ నిలబడ్డాడు. కిరణ బండిలోనుంచి దిగడం చూచేసరికి మురళికి ఒకవిధమయిన సంతోషం కలిగింది. కిరణ బండిలోనుంచి సరాసరి ఇంట్లోకి వెళ్లింది. మురళి, కిరణనుగురించి వినిగాని, ఎప్పుడైననూ ఆమెను కనిగాని యెరుగడు. అలాంటప్పుడు కనివిని యెరుగని వ్యక్తియొక్క దర్శనము అతనికి యెందువల్ల హృదయాహ్లాదకరముగా నుండెనో అతనికే తెలియదు. కిరణ దిగిన బండిలోనుంచే ఒక పురుషవ్యక్తికూడా దిగాడు. అతడు మురళికి పరిచితుడే. అతడూ, మురళీ, మద్రాసులో చదువుకునే సమయంలో ఒకే రూములో వుండేవారు. అదీగాక కాబోయే పెండ్లికొడుక్కి పినతండ్రికొడుకు. బహుశః కిరణ అతనియొక్క భార్యయేమోనని మురళి అనుకున్నాడుగాని, నాలుగునెలల క్రిందగూడా తనకింకా వివాహము కాలేదని వ్రాసిన వుత్తరం మురళికి జ్ఞాపకం వచ్చింది. అతడు బండి దిగినవెంటనే, ఎదురుగా నిలబడియున్న మురళిదగ్గరకు నవ్వుతూవచ్చి షేక్‌హ్యాండిచ్చి "ఏరా మురళీ!......హౌఆపాటు! నీవు నాకు బావమ

అదివి కాబోతున్నావు గదూ! ఇప్పుడుగూడా 'ఏరా' అంటే బాగుండదు. ఏమండీ, బావగారూ! పోస్టాఫీసుకు వెళ్ళే అభ్యాసం మీకులేదాయేం? లేక తీరుబడి లేదా? లేక మూడు కానులు చేతులోలేవా! మొత్తానికి ఏకారణంచేతనోగాని, నేను వ్రాసిన వంద వుత్తరాలకు సగటున ఒక వుత్తరంగూడా నీవు వ్రాయడంలేదు" అన్నాడు. "సూరీ! ఇప్పుడు నన్ను 'ఏరా' అనే పిలవచ్చు. ఇంకా నాలుగురోజులకుగదా నీకునేను బావ మఱది నయ్యేది! అప్పుడుగూడా నన్ను 'ఏరా' అనే పిలవ వచ్చు. నీవు పిలచినా పిలవకపోయినా నేనుమాత్రం నిన్ను 'ఏరా' అనే పిలుస్తా" అన్నాడు మురళి. కొంతసేపు యిద్దరూ యీవిధంగా నవ్వులాటగామాట్లాడుకుని మురళి రూములోకి వెళ్లారు. సూరి క్యాంపుకాటుమీద కూర్చున్నాడు. మురళి కిటికీలో ఒకకాలు, క్రింద ఒకకాలు పెట్టి నిలబడి "సూరీ! ఆ అమ్మాయి యెవరురా?" అన్నాడు వరండాలోకూర్చొన్న కిరణను కిటికీ చువ్వల సందుల్లోనుంచి చేత్తో చూపిస్తూ. సూరి క్యాంపుకాటుమీదనుంచి లేచి కిరణను జూచి ఒక్క క్షణంల్లో క్యాంపుకాటుమీద వ్రాలి యిలా చెప్పమొదలె ట్టాడు: "ఆ అమ్మాయి తండ్రి గుంటూరు తాలూకాలో ఒక గ్రామానికి కరణం. తల్లిదండ్రులకు ఆమె ఒక్కర్తే కూతురు. కొడుకు లెవ్వరూ లేరు. ఆ అమ్మాయిపేరు కిరణ. కిరణ చిన్న తనంలో యెంతో గారాబంగా పెరిగేది. కిరణ యేడ్పు వాళ్ళ కెంతో కష్టమనిపించేది. కిరణ అదృష్టవంతురాలుగాదు. కిరణ జన్మనక్షత్రం మంచిది కాదు. తల్లి గండాన పుట్టింది. ఎన్ని

శాంతులు చేయించినా ఆనక్షత్రపు పవరు తగ్గలేదు. కిరణ రెండవ యేటనే తల్లి మరణించింది. తల్లి మరణించిన తర్వాత కిరణకు వితంతువు మేనత్తవుంది. ఆమె అష్టకష్టాలనుభవించి తన కన్న కుమార్తె మాదిరిగా భావించుకుని రెండు సంవత్సర ముల కిరణను పన్నెండు సంవత్సరములదాన్ని జేసింది. ఇప్పుడే నీకు ఒకచిన్న విషయం చెప్పాలి. ఆ విషయం చెప్పకపోతే యీ కథ నీవు తెలుసుకోలేవు. ఆమె జీవిత సౌఖ్య నాశనానికి ఆ విషయమే ముఖ్యకారణం......"అని చెప్పబోతుండగా మురళి ఆశ్చర్యంతో నోరు తెరచుకుని "ఆమె జీవితసౌఖ్య నాశనమేమిటిరా" అన్నాడు. ఓహో! నేను ఒకవిషయం నీకు చెప్పడం మరచాను. ఆ విషయం మొదటనే చెప్పి వుండాలి సింది. ఆమె బాలవితంతువు" అన్నాడు సూరి. "ఆఁ" అన్నాడు మురళి ఏదో ఒకవిధమైన భయంతోనూ, ఆశ్చర్యంతోను. "అప్పుడే యీఒక్కవిషయానికే నీవు విచారం చెందకు. ఆమె జీవితచరిత్రలో యింతకంటె ఎక్కువ విచారం కలుగజేసే ఘట్టాలు, ప్రపంచకంలో ఏ మానవులైనా యింతటి కష్టదశ లనుభవించారా అని సందేహం కలుగజేసే ఘట్టాలు ఎన్నో వున్నాయి." అని సూరి మాట్లాడుతూన్న మాటలు మురళి హృదయాన్ని కలచివేశాయి.

"సూరీ! ఆ అమ్మాయికి సుమారు ఇరవై సంవత్సరా లుంటాయా?" అన్నాడు మురళి.

"ఇరవైయ్యే! పద్దెనిమిదో సంవత్సరం యింకా వెళ్ళ లేదు" అన్నాడు సూరి.

"సూరీ! యీ చిన్న జీవితంలోనే అల్లాంటి కష్టదశలా?" అన్నాడు విచారంతో మురళి.

"చిన్న జీవితమేమిటి ? పెద్దజీవితమేమిటి? ఒక్కొక్క మానవ వ్యక్తిజీవితం అత్యంత దుఃఖమయంగా వుంటూ వుంటుంది." అన్నాడు సూరి.

"ఆ తర్వాత చెప్పు. తొందరగా" అన్నాడు ఆతురతతో మురళి.

"నీకు ఆమె చరిత్రం వినాలని ఆదుర్దాగావుందా యేమిటి? అయితే చెప్పుతున్నా విను" అని మళ్ళీ యీవిధంగా చెప్పడం మొదలెట్టాడు.

చిన్నతనంలో కిరణను ప్రేమాస్పదంగా మేనత్త ఎందుకు పెంచిందనుకున్నావ్! ఆవిడకు ఒక కుమారుడున్నాడు. అతడు పరమ దుర్మార్గుడు త్రాగుడు అలవాటుంది. ముండల ముఠాకోరు. శరీరమంతా రోగాలపుట్ట. పిత్రార్జితం నలభై వేల రూపాయలాస్తిలో ఆయిదువేల రూపాయలాస్తిమాత్రం దక్కింది. అయినా, ఆ గ్రామంలోని పెద్దమనుష్యులందరూ కూడి అతని తండ్రిమీద వున్న అభిమానంవల్ల ఆస్తిఅంతా వూడ్చిపెట్టుకు పోతోందే అనే విచారంతో ఒకనాడు అతని చేతిలో ఒక వందరూపాయలు పెట్టి, ఆ ఆస్తిని తల్లిపేరిట వ్రాయించి రిజిష్టరు చేయించారు. అతడు. వివాహం కాక ముందే రౌడీతనంగా ప్రవర్తించడంవల్ల వివాహం కాలేదు. కిరణను అతనికిచ్చి వివాహం చేద్దామనే వుద్దేశ్యంతోనే, తల్లి మరణించిన పదియవరోజునే కరణం యింట ప్రవేశించింది.

కిరణకు పదియవసంవత్సరం దాటక మునుపే వెంకమ్మ (మేనత్తపేరు) వివాహప్రయత్నాలు మొదలెట్టింది. కరణానికి యీ సంబంధం యిష్టంలేకపోయినా, ఆ వుద్దేశ్యం బయట పెడితే ఎప్పుడు వెంకమ్మ లేచిపోతుందో అని ఇప్పుడు గాదని అప్పుడు; అప్పుడు గాదని యిప్పుడు; అని యీ విధంగా రెండు సంవత్సరాలు జరిపాడు. ఈ అడ్డంకులవల్లనే కరణం మొక్కడా సంబంధాలు గూడా కుదర్చుకోనలేదు. ఏదైనా సంబంధాన్ని గూర్చి విచారించినప్పుడల్లా వెంకమ్మ తగువు లాడేది. చివరకు కిరణను వెంకమ్మ కొడుక్కిచ్చే వివాహం చేశారు......" అని యింకా పూర్తిగా చెప్పకమునుపే మురళి తన రెండు కర్ణములను రెండు చేతులతోమూసు కుని "రామ! రామ! యీ సుకుమారిని, ఆదుర్మార్గునికిచ్చి వివాహంచేశారా?" అన్నాడు ఎంతో విచారంతో.

కిరణయొక్క కథనంతా చెప్తూన్న సూరి నేత్రముల వెంబడి కన్నీటికాల్వలు ప్రవహిస్తూన్నాయి. మురళి వూరు కున్నంతసేపూ దుఃఖాన్నిమింగి సూరి చెప్పగలిగాడుగాని, మురళి నోరు తెరిచిన తర్వాత మాత్రం సూరి వూరుకోలేక పోయాడు. సూరి బావురుమన్నాడు. "ఆమె చరిత్రం విన్నంత మాత్రాన్నే, మనమింత దుఃఖపడుతూంటే, యీ కష్టాలన్నీ యనుభవించిన కిరణ ఎంత దుఃఖం పొందిందో గదా! మన గుడ్డి హిందూసంఘంలోని వనితలు, హిందూ ధర్మశాస్త్రా లకు ఎందరు బలియగుచున్నారో గదా! ఈ నిర్బంధవివాహ ములు మానవ జీవితాలకు సుఖం లేకుండా జేస్తున్నాయి.

ఒక్కొక్క విషాదకరమగు సంసారాన్ని గురించి విన్నప్పుడు కడుపులో మండుతోంది. ఈ హైందవధర్మ శాస్త్రాలు యింత గొడ్డువేమా అనిపిస్తోంది. హృదయం లేనివాళ్లు, దయకు, సత్యానికీ హృదయంలో స్థానంలేని మహానుభావులూ యీ ఆచారాలను నియమించి యుండాలి..." అన్నాడు మురళి.

మళ్ళీ సూరి యిలా చెప్పడం మొదలెట్టాడు: "కిరణకప్పుడు చిన్నతనమైనా, యీ వివాహం నాకునచ్చని తండ్రితో ఖచ్చితంగా చెప్పేశింది. కాని యేంలాభం? కరణం కుమార్తె మాటలను లక్ష్యం చేయలేదు. వివాహమైన తర్వాత తన స్నేహితురాండ్రద్వారా, తనభర్త చేయుచున్న దుర్మార్గములను విని ఎంతో ఖేదం పొందేది. కిరణ రజస్వల అయిన ఆరు మాసములకే గర్భాదానం చేయమని కిరణభర్త వెంకట్రావు ఫర్మానా చేశాడు. కరణం తనకుమార్తెను చూడక ఒక్క క్షణమైననూ నిలువలేనివాడైననూ, ఇప్పుడు కనుక పేచీ పెడితే, పిల్లను ఆ దుర్మార్గుడు ఎన్ని అవస్థలు పెడ్తాడో అని వెంకట్రావు నోట్లోనుంచి మాట రాగానే ఆ కాస్తా అయిందనిపించాడు. వెంకట్రావు ఆ నాలుగురోజుల్లోనూ కిరణను పెట్టిన బాధలు వర్ణనాతీతములు. బాగా త్రాగి గదిలోకి వచ్చి మంచంమీద పడి గురకపెట్టుకుంటూ నిద్రబోయేవాడు. మురళీ! ఇంకొకడైతే నా కిరణను ముట్టకుండా వూరుకునేవాడా? జగన్మోహనాకారమగు కిరణ ఎదుట నిలబడి యుండగా ఎవడికి వూరుకో బుద్ధిపుడుతుంది. వెంకట్రావుకు కిరణ

యొక్క అందం యెందుకు? ఆ నాలుగు రోజులలో ఒక్క రోజుగూడా కిరణతో తిన్నగా మాట్లాడ్డం యెరుగడు. ఒక రోజున-మూడోరోజున-గాబోలు గుటక పెట్టి నిద్రబోతూన్న వెంకట్రావు ప్రక్కనే కూర్చొని కిరణ అతని చేతిని ముద్దిడుకుందిట. వెంకట్రావు కండ్లు పెద్దవిగా జేసుకుని 'మాదర్చోద్ ! ఎవరు రమ్మన్నారే నిన్ను ?' అని తన బండకాలుతో ఒక తన్ను తన్నాడట. ఆ తన్నుకు కిరణ సుకుమార శరీరం పెద్ద పెట్టున వాచింది. దుర్మార్గుడగు వెంకట్రావు చేతిని కిరణ ఎల్లా ముద్దుపెట్టుకుందిరా అని అడుగుతావేమో. వెంకట్రావు దుర్మార్గుడైననూ కిరణ యే మాత్రము అగౌరవమూ చేసేదికాదు. అతడు దుర్మార్గుడైననూ పతినే గొల్వాలనేమతం కిరణది. ఆ రోజున కిరణ గదిలోనుంచి వచ్చిన తర్వాత కొందరు అమ్మలక్కలు "ఏమే కిరణా ! ముఖం అల్లా వాచిందేమే" అని అడిగారు. కిరణ యేమి సమాధానం యివ్వలేదు. కిరణం యీ చేష్టలన్నిటినీ సహించలేక వెంకట్రావును కొంచెంబిగ్గరగా కోప్పడ్డాడు. అంతటితో వెంకట్రావుకు శివం పెరిగింది. నానా బూతులూ మామగార్ని తిట్టి 'యిక నాకీ పెండ్లాం అక్కర్లేదు' అని లేచి పోయిన్నాడు. అ లేచిపోవడం మళ్ళీ అత్తవారింటివైపు తిరిగి జూడనేలేదు. కిరణ తన భార్య అన్న సంగతిగూడా అతనికి జ్ఞాపకంలేదు; స్త్రీ లోకమంతా అతని దృష్టిలో వ్యభిచారులే. అతడు అందచందాల్ని జూచి సంతోషించేవాడుకాదు. అత నికి కావాల్సిందల్లా అవయవాలే. అల్లాంటి దుర్మార్గుణ్ని

కిరణయొక్క మోహినీ రూపము ఎలా ఆకర్షించ గలదు ? కిరణ మనోవ్యధకు మితిలేదు. "నాన్నా! నా కాపురం పాడు చేశావ్ ! ఒక్కమాటు రమ్మని కబురు చెయ్యి" అని వలవల యేడ్చేది కిరణ, కరణం తీరుబడిగా కూర్చున్నప్పుడు."అమ్మాయి! నన్నేంచేయమన్నావ్? నాకుమాత్రం విచారం లేదూ నీకా పురం పాడైందని. నేను లోలోపల యెంతగా కుమిలిపోతు న్నానో నీకు తెల్సునా? వాణ్ణి ఎన్నో సార్లు రమ్మని కబుర్లు చేశాను. నన్ను నానాబూతులూ తిట్టాడట. ఇక చేయవల్సిం దేమీ లేదు. నాగర్భాన జన్మించిన ఒక్కకాయమైనా, అదీ నిష్ఫలంగానే వుంది. నీమీద నేను ఆశపెట్టుకు కూర్చుంటే, నా ఆశలు నిరాశలు చేశాడు భగవంతుడు, అమ్మాయి! ఏడవకు, ఆ ఏడుపుకు నేనేముఖ్యకారకుణ్ణి. వాడు దుర్మార్గుడని తెలిసి గూడా, వాడికిచ్చి వివాహం చెయ్యడం నాదే బుద్ధిలోపం. వివాహం అయితే బుద్ధికుదిరి వుంటాడనుకున్నాను గాని, మరీ యింత విచ్చల విడిగా ప్రవర్తిసాడనుకోలేదు." అని కరణం గారుకూడా కండ్లనీళ్లు పెట్టుకునేవాడు. ఒకరోజున కిరణ తన తండ్రిని పంపింది వెంకట్రావుకు బ్రతిమాలి తీసుకురమ్మని. కరణం దీనముఖంతో తిరిగి యింటికి వచ్చాడు. 'ఏం నాన్నా? ఏం జరిగింది?' అంది కిరణ. ఏం జరగడమేవిటి అమ్మాయి? ఇంకా యీ కాపురంమీద నీకు ఆశయెందుకు? వాడేమా త్రమూ మారలేదు. వూళ్ళో ఎన్క్వైరీచేయగా ఎవరో ఒక భోగం దానింట్లో వుంటాడని చెప్పారు. సందులు గొందులు తిరిగి ఆ భోగందానింటికి వెళ్ళి వెంకట్రావ్ అని కేక వే

శాను. ఒక గంటసేపటికి ఒక కుఱ్ఱది తలుపుతీసి లోపలికి రమ్మంటున్నారంది. జడుస్తూ లోపలికెళ్ళాను. 'ఆ దుర్మార్గుడు పట్టెమంచంమీద కుడుకుని వున్నాడు. నన్ను చూడగానే, నేనేమీ వాడితో చెప్పకమునుపే ఆపట్టె మంచం మీదనుంచి నామీదకు అమాంతగా ఒక్కదూకు దూకి, నాచేతిలోని కఱ్ఱ లాక్కుని నా వ్రేళ్ళంతా పగుల గొట్టాడు. తలుపులు గడియలువేసి నన్ను కొడుతూంటే నా కెవ్వరూ దిక్కులేక పోయారు. చివఱకు పెద్ద పెద్ద కేకలు వేశాను. పదిమంది ప్రోగై తలుపు తీయించారు. బ్రతుకు జీవుడాయని బయట పడ్డాను. లేకపోతే నా ప్రాణం పోయేది......" అన్నాడు బొంగురు పోయిన కంఠంతో ఒక వేడి నిట్టూర్పు విడుస్తూ. 'నాన్నా! నేనే వెళ్ళి వారి కాళ్ళమీద పడితే ఏం జరుగుతుందో', అంది కిరణ. 'అమ్మా! నీవు వెళ్ళొద్దు. వాడు త్రాగుబోతు. వానికి మంచిచెడ్డా వివక్షతా జ్ఞానంలేదు. ప్రాణం తీయడానికి గూడా వెనుదీయడు. వాని కదే వృత్తి అయినప్పుడు యింకా దయ యెందు కుంటుంది అన్నాడు" కరణం.

"కిరణ, వెంకట్రావుకు ఎన్నో జాబులు వ్రాసింది. ఆ దుర్మార్గుడు ఒక్కజాబుకి జవాబువ్రాసి యెరుగడు. కిరణ తన జాబులలో తన తండ్రిదే అపరాధ మనియూ, అందులకు యిప్పుడు తగిన పశ్చాత్తాపము చెందుచున్నారనియు, యీ దీనురాలిపై కరుణ చూపించవలయు ననియూ, యింకా యేమేమో దీనముగా వ్రాసేది. కిరణను బహిష్కరించి

మూడు సంవత్సరములైంది. ఆమె అందాన్ని గ్రోలి ఆనం దించే నరపురుగెవరు? లేకపోవడ మేమిటి? ప్రపంచంలో ఎంతోమంది పురుషులు స్త్రీలు తమవంక జూచినంత మాత్ర మున నే తమ్ము ప్రేమించినదని నమ్మువారు చాలమందిగలరు. అథవా యిదివరలో పురుషసుఖమన నేమో తెలియక పురుష స్పర్శ కోఅకై అల్లల్లాడుతున్న స్త్రీ, పురుషుడ్ని నమ్మి అంగీ కరించగానే, ఆమె యౌవ్వన మున్నంత కాలమూ ఆమెతో సుఖ మనుభవించి, ఆమెయౌవ్వనాన్ని ఈగ మకరందాన్ని గ్రోలినట్లు మకరందాన్ని పీల్చివేయడం, యిక ఆ స్త్రీని తరిమివేయడం—ఇలా ఎన్ని జరగడం లేదు. కిరణ తనకా మాన్ని అపుకోని స్థితియందున్ననూ, తన హృదయాన్ని ఇతరుల కెవరికినీ అర్పించలేదు. కిరణ దూరాలోచన గలది. ఆమె నోటినుండి వచ్చే ప్రతి పలుకులోనూ ఒకవిధమైన నీతీ, ధర్మమూ, సత్యమూ, తాండవిస్తూ వుంటాయి, ఎంత దుర్మా ర్గమైన మాటనైనా సరే దానికి ఒకవిధమైన రసాన్ని కల్పించి ఆమాట మంచిమాటే ననుకునేటట్లుగా చేయగలశక్తిఆమెలో వుంది. ఆమె కంఠస్వరమే పురుషుని హృదయాన్ని జలదరింప జేస్తుంది. నిజంగా ఆమెలో, మానవునికి వుండనట్టి శాంతివుంది. నేను నీతో అనగా మనమిద్దఱమూ మదరాసులో చదువు కుంటూండగా సెలవురోజుల్లో కిరణ గారింటికి వెళ్ళాను. కిరణ నాకు మేనమామకూతురు. మాసొంత మేనమామ కూతురు గాదు. మా అమ్మకు పెదతండ్రి మనుమరాలవు తుంది. నేను చిన్నప్పటినుండీ కూడా తరుచుగా కిరణగారింటికి

వెళుతూంటాను. నేను ఆనెలవుల్లో వాళ్లింటికి వెళ్లినప్పుడు ఆమెశీలాన్ని పూర్తిగా గ్రహించగలిగాను. ఇప్పుడు ముఖ్యంగా మనం ఆమె హృదయంలోవున్న ఓర్పుకు సంతోషించాలి. నేను ఒకనాటి సాయంకాల సమయాన బయటి అరుగుమీద కూర్చున్నాను. కిరణ వాకిట్లో నిలబడింది. కిరణ అసలు బయటకు రానేరాదు. ఎప్పుడో ఒకనాడు బయటకు వస్తే యిల్లాంటి శాస్తులు చాలా జరుగుతూంటాయి. ఆదారినే వెళుతూన్న ఒకమహామ్మదీయ కుర్రాడు కిరణ వంక అదే తీరుగా జూస్తూ, నవ్వుతూండడ మారంభించాడు. నాకు చాలా అసహ్యం వేసింది. కిరణ వెంటనే లోపలి కెళ్ళి పోయింది. నేనుగూడా లోపలికెళ్ళాను. కిరణ నావంకజూచి నవ్వి 'సూరీ! చూచావా లోకం పోకడ? వీళ్ళదుంపతెగ! వాకిట్లో నిలబడనీయరుగదా" అంది. "అదేతీరుగా జూడకుండా ఆ రెండుకండ్లనూ పొడిచి వదిలిపెడితే సరి......" అన్నాను చికాకుతో. "నన్ను చూస్తారని నేను అసూయ చెందడంలేదు. నాలో కొంచెమో; గొప్పో అందం వున్నది. కాబట్టే వాళ్ళు నావంక జూస్తూంటారు. వాళ్ళు నావంక జూడటం నాకు పరమయిష్టం. నా అందాన్ని జూచి వాళ్ళు సంతోషిస్తే నాకు ఎంతో ఆనందం. నా అందాన్ని జూచి సంతోషిస్తూ వెళ్ళిపోకూడదూ! నా అందాన్నంతా ఒక్క గుక్కలో మింగేద్దామని వుంటుంది నన్ను జూచేవారల కంద ఆకూ. నిజంగా యీ మానవ ప్రపంచంలో అందరూ ఇంతే. నలుగురుండే చోటున ఒక గులాబిపుష్పం పూచిందంటే,

చెట్టునున్న పుష్పంయొక్క పరిమళాన్ని పీల్చి దానియొక్క అందంజూస్తూ తృప్తిచెందరు. ఆ పుష్పాన్ని చెట్టునుండి త్రుంపి, దానిని నలిపివేస్తేగాని తోచదు..." అని కిరణ చెప్పబోతూండగా నేనును అందుకుని "సౌందర్యం వున్నందు లకు సార్థకం చేసుకు తీరాలి. దేవుడు అందాన్ని ఎందుకు సృష్టించింది? దానివల్ల కొంతవఱకు మనుజులు సౌఖ్యము చెందుటకే. నేను నీతో వాదానికి మాటాడు తున్నాను. కాని నా వాదంలో తప్పులను తీసుకుని నన్ను క్రూరు డినిగా భావించకు. అడవిలో ఎన్ని పరిమళ పుష్ప ములు పూస్తున్నాయి? ఆపుష్పములయొక్క పరిమళాన్ని అనుభవించేవా రెవ్వరూ వుండరు. అందువల్ల ఆపుష్పములు వాటంతటవే రాలిపోతాయి. కాని ఏం లాభం? ఆపుష్ప ములకు దేవుడు పరిమళాన్ని సృజించినందులకు ఏం ప్రయో జనం కలిగింది" అన్నాను. "హిందూ ధర్మశాస్త్రాలు నాసౌం దర్యాన్ని అనుభవించుటకు ఎవనికి హక్కు కల్పించినదో, వాడే నాసౌందర్యాన్ని అనుభవించేటందుల కర్హుడు." అంది కిరణ. దుర్మార్గుడగు వెంకటరావు నెడల కిరణకు యెంతభక్తి అని ఆశ్చర్యపోయాను......" అని సూరి చెప్పబోతుండగా లోపలనుంచి "భోజనానికి రండోయ్" అని కేక వినబడ్డది. మురళీ, సూరీ భోజనానికి వెళ్ళిపోయారు. మురళి భోజన సమ యంలో కిరణను ఆడవాళ్ళ బంతిలో చూచాడు. మురళి తన దృష్టిని కిరణమీాదనుంచి మరల్చుకుందామని ప్రయత్నిం చాడు. అది అతనికి చేతగానిపని అయింది. ఆమె పెదవులు

కదిలి నప్పుడల్లా అమృతం ఒలుకుతున్నదా అనిపించేది మురళికి. దేవుడు, తన సౌందర్య సృష్టిలోని నైపుణ్యమంతా యీామెయందే చూపినాడా అనిపించింది. ఇంతలో కిరణ ఒకపాట పాడడం మొదలెట్టింది. ఆ కవిత్వమే యెంతో సరళంగానూ, మధురంగానూ వుంది. దానికి తగినట్లు కిరణ కంఠస్వరం, ఆకవిత్వానికి కొంతవఱకూ మెఱుగుపెట్టింది. ఆపాట మురళి హృదయమధ్యాన ప్రతిధ్వనించింది. ఇది వఱకల్లా ఆమె అందాన్ని జూచే సంతోషించే వాడు. ఇప్పుడు ఆమెయొక్క గాన సుధను, సుందరాకారాన్ని జూచి ఆనందించడం మొదలెట్టాడు. ప్రణయ సముద్రంలో మునిగి తేల్తున్న ప్రతివాడికీ, తాను ప్రేమించిన స్త్రీ యెంత అందవికారిణియైనను, యెంత దుర్మార్గురాలైనను సరే, వాడి కంటికి ఆమె సౌందర్య దేవతగాను, శీలవతిగానూ కనబడు తూంటుంది. కాని యిక్కడమాత్రం అలాకాదు. కిరణ ప్రణయపాత్రతా లోలుడైన మురళి, ఆమెయొక్క అందాన్ని, గానాన్ని జూచి సంతోషించడం సహాజమే. భోజనములు చేస్తూన్న అయిదువందల జనమూ, ఆమె నోరువిప్పి పాడు తోంటే బొమ్మల్లాగా రెప్పవాల్పకుండా ఆమెను జూడడం మొదలెట్టారు. మురళిప్రక్క కూర్చొన్న యిద్దరు పురుషులు వారిలో వారు ఏవేవో గుసగుస లాడుకుంటున్నారు. ఆగుస గుసలు కిరణనుగురించి అనిమాత్రం మురళికి తెలుసు. వాటిని వినాలనిమట్టుకు మురళి ప్రయత్నం చేయలేదు. ఆమె జీవిత చరిత్రను సూరియే చెప్పాలి. అతని వాగ్ధాటిలో నున్న

మధురం మరిఎవ్వరి వాగ్ధాటిలోనూ వుండబోదని మురళి గట్టి నమ్మకం. కిరణయొక్క సౌందర్యాన్ని, శీలాన్ని, అర్థం చేసు కున్నది యీ విశాల మానవ విశ్వంలో సూరి ఒక్కడేనని మురళి నమ్మకం. ఆమె జీవితాన్ని నూత్నపథంలోకి దింపు టకు తన సర్వశక్తులు తీవ్రంగా ఉపయోగించుతాడని మురళి నమ్మకం. సూరి, కిరణను ప్రేమించినాడేమో ? అను సం దేహం మురళికి తోచింది. ఆ సందేహంకూడా సూరియే తీర్చగలడని మురళి నమ్మకం. కిరణ ఇంకొకపాట పాడడం మొదలెట్టింది. మురళి భోజనంచేస్తూన్న బంతిలోనుండి కిర ణనుగురించి అనేక భాషణలు ఆతని చెవిని బడుతున్నాయి. "ఆమె మంచిపేరు గాంచిన కవయిత్రి"అని మురళికి వినబడ్డది. మురళి హృదయం మళ్ళీ నూత్న పరిణామం పొందినది. కిరణ యొక్క సౌందర్యాన్ని తనదిగా చేసుకోవలెనని అతనికి కోరిక గలిగింది. తర్వాత ఆమె గానసౌరభ్యం అతని కోరికను వృద్ధి జేసింది. "కిరణ అందములేని కురూపియైననూ నేను తప్పక ఆమెను ప్రేమించేవాడినే" అనుకున్నాడప్పుడు. అనగా ఆమె యొక్క సౌందర్యంకంటె, ఆమెయొక్క గానం ఎక్కువ ఆక ర్షణ శక్తిగలదిగా వుందన్నమాట.ఆ తర్వాత ఆమె కవయిత్రి అని తెలుసుకున్న తర్వాత "కిరణకు సౌందర్యమూ, గానమూ, కవిత్వమూ లేక శుష్కదరిద్రురాలై అడుక్కుంటున్నా నేను ఆమెను ప్రేమించేవాడ్నే" అనుకున్నాడు మురళి. నిజంగా మురళిని ఆకర్షించే ఆమెలోని శక్తులు యీ మూడే. కాని యీ మూడు శక్తులచే మురళి పూర్తిగా ఆకర్షింపబడ్డ తర్వాత

కిరణ హృదయంలోని శూన్యజీవియే తనను ఆకర్షించినది గాని, యీ మూడు శక్తులూ కిరణలో నున్ననూ, లేకపోయిననూ కిరణను తప్పక ప్రేమించియుండేవాడ్నే అనుకుంటున్నాడు మురళి కొంచెంసే పయింతర్వాత మురళి ఆశాసముద్రం కొంచెం మందంగా ప్రవహించడం మొదలెట్టింది. ఎందువల్లనంటే ఆమె సంగీతకోకిల, కవయిత్రి, సౌందర్యవతి. మరు నిముసంలోనే తానుగూడా కవి అని జ్ఞాపకం వచ్చేసరికి అతని ఆశాసముద్రం యధాప్రకారంగానే ప్రవహించడం మొదలెట్టింది. ఆమెలోనున్న మూడు మహత్తరమైన దివ్యశక్తులు చూచేసరికి, తనలోనున్న దివ్యశక్తులను మఱచాడు మురళి.

మురళి భోజనమునుండి లేస్తూ "యీమె కవయిత్రియా? సూరినడిగి తెలుసుకుందా" మని లోలోపల అనుకున్నాడు. మురళి తన గదిలోకి వెళ్లుతూ "సూరీ!" అని బిగ్గఱగా కేక వేశాడు. అప్పుడు సూర్రి కిరణతో ఏమేమో నవ్వుతూ మాట్లాడుతూన్నాడు. మురళియొక్క కేక సూరికి వినబడలేదు. కిరణయొక్క కర్ణములలో మురళియొక్క కంఠస్వరం 'ఖంగు'మని మ్రోగింది. బ్రహ్మచారియై, కళాసేవయే తన జీవితపరమావధియని తలచి స్వార్థత్యాగియై, కాలేజీలో నుంచి కాళ్లు బయటపెట్టినది మొదలు యిప్పటివఱకూ సారస్వతమునకు అతను సలుపుతూన్న బ్రహ్మాండమైన సేవ అతని కంఠస్వరంలో ఉజ్జ్రూతలాడింది. "సూరీ! నిన్ను వారెవరో పిలుస్తున్నారు" అంది మురళివంక చెయ్యి చూపిస్తూ. సూర్రి,

మురళీవైపు ముఖం త్రిప్పి "మురళీ! డాబామీద పడుకుందాం. పట్టుబట్ట విడిచి లుంగీ కట్టుకుని వస్తున్నా. చాకలిని పక్కబట్టలను డాబామీదకు తీసుకువెళ్ళమను. నీవు గూడా డాబామీదవుండు వస్తున్నా." అన్నాడు సూరి. "ఈయన యెవరో కళామూర్తిలాగా వున్నాడే." అనుకుంది కిరణ, మురళిని జూడగానే. "సూరీ! అతనెవరురా" అంది కిరణ మృధు మధుర కంఠస్వరంతో. "అతడా! అతను నాకు కాలేజీ జీవితంలో ప్రాణ స్నేహితుడు. ఇప్పుడు బావమఱది. ఓహో! మఱచిపోయాను. అతని ముఖాన్ని నీవు యెరుగకపోయినా, అతనినామం నీవు తఱచుగా వినియుంటావనే తలుస్తాను. అతను పేరుగాంచిన కవి. అతనిపేరు మురళీకృష్ణ. గృహలక్ష్మిలోనూ, భారతిలోనూ, ఎక్కువగా హృదయ గాంభీర్యమైన భావగీతములు వ్రాస్తూ వుంటాడు......" అని సూరి చెప్పటం సంపూర్తిగాకముందే "ఇతనా మురళీకృష్ణ! అబ్బా! యీతని భావగీతాలు ఎంత హృదయరంజకంగా వుంటాయనుకున్నావ్! ఆగీతాల్లో ఎంతమధురత్వముంటుందో, ఇతడినేత్రాల్లోగూడా అంత మధురత్వం యిమిడివుంది." అంది కిరణ ఆశ్చర్యంతో. మురళినిగూర్చి గొప్పగా పత్రికా సంపాదకులు వ్రాసిన వ్రాతలు ఆమె భావవీధిలో విహారం సలిపాయి. మళ్ళీ కిరణ నవ్వుతూ "యీ పెండ్లికి రావడం నాకు లాభంగానే వుంది. ఒక గొప్ప కళాజీవి దర్శన భాగ్యం లబ్బింది" అంది. "అబ్బే! అతనితో మాట్లాడవచ్చును గూడాను. అతడు స్వార్థత్యాగి డాంబీకుడుగాడు. ఆదీగాక నీపేరుగూడా పలు

మార్లు వినివుంటాడు. అందువల్ల నీతో ఎక్కువ గౌరవంగా మాట్లాడతాడు” అన్నాడు సూరి. అతడు మురళీకృష్ణయని వినగానే, కిరణ హృదయంలో ఏదో చెప్పరాని సంతోషం కలిగింది “వస్తాను కిరణా” అని సూరి వెళ్ళిపోయాడు.

సూరి, మురళి, దగ్గఱ దగ్గఱగా పక్కగుడ్డలు పర్చుకుని పడుకున్నారు, మురళి అడగకమునుపే సూరి యీవిధంగా చెప్ప నారంభించాడు:

“ఇలా మూడు సంవత్సరాలు జరిగిన తర్వాత ఆమె జీవితంలో ఒక విచిత్ర సంఘట్టన సంభవించినది. వెంకట్రావుకు ఒక బోగంది మందుపెట్టి చంపివేసింది. కాని దానికి మనము, విచారం చెంద నవసరంలేదు. వెంకట్రావు జీవించివుండగా ఎంత సుఖమో ఆమెకి, యిప్పుడూ అంతే సుఖము”

మెట్లమీదనుంచి అడుగుల చప్పుడు వినబడ్డది. కిరణ వయ్యారంగా నడుస్తూ డాబా మీదకు వచ్చింది. “కిరణా! రా ఇల్లా కూర్చో!” అని అన్నాడు. కిరణ, మురళిని ఓరకంట వీక్షిస్తూ సూరి బెంచ్ మీద కూర్చొన్నది. సూరి మురళివైపు జూస్తూ “మురళీ యీమె ఒక కవయిత్రి” అన్నాడు చిరునవ్వుతో!.

“పేరూ—” అన్నాడు మురళి ఆశ్చర్యంగా.

“కిరణాదేవి. ఈ నెల భారతి లోని ‘మానవహృదయం. రచయిత.”

మురళి అభిప్రాయములు యింకా లోతుకు వెళ్ళాయి. “ఆమె ‘మానవహృదయం’ రచయిత అయినట్లయితే, ఆమె

ప్రకృతిని ఒక్క చూపులో అవగాహన చేసుకోగలదన్న మాటే. ఆమె శరీరంలోని ప్రతి అవయవంలోనూ, సృష్టివై చిత్ర్యమును తారుమారు జేయగలశక్తులు గల కవితా నారీ మణులు, ఆంధ్ర కవితారంగమున నుండుటబట్టియే, ఇంత మాత్రముగా నైనా ఆంధ్రకవితారంగము శోభాయమానంగా విరాజిల్లుతోంది" అని మురళి తలపోస్తూవుండగా, సూరి పకపక నవ్వుతూ 'కవులు ఇద్దరూ ఒక్కచోటనే కూడారు. ఇక ముచ్చటించండి కవితా విషయాలు." మురళి సూరివంక జూస్తూ, కిరణను సంబోధించి "మానవ హృదయంలోని, నాలుగవ పద్యం మీ కవితా సామర్థ్యాన్ని వెల్లడిచేస్తోంది అన్నాడు తడబడుతూన్న కంఠంతో. కిరణ అతనికి సమా ధానంగా ఒక్కచిరునవ్వు, తన పెదవులమీద ఉదయింప జేసింది. మురళి తనయొక్క కవితాశక్తి నంతనూ వుపయో గించినా, ఆమె చిరునవ్వుయొక్క యథార్థరూపాన్ని గ్రహించ లేడు. ఆమె చిరునవ్వులోనే అంత ప్రభావమున్నచో, ఆమె హృదయంలో ఎంత ప్రభావమున్నదనాలి? స్త్రీలయొక్క చర్యలు కొన్ని కవి వర్ణించుటకు అశక్యముగా వుంటాయి. ఒక్కొక్క స్త్రీయొక్క ముఖసౌందర్యాన్ని, ఒక్కొక్క స్త్రీయొక్క మాట సొంపును, ఒక్కొక్క స్త్రీయొక్క నడకవయ్యారాన్ని జూస్తే, ఆడవాళ్ళను, మగవాళ్ళకు ఆనంద మియ్యగలందులకే దేవుడు పుట్టించాడా అని మనకు సందేహం తోస్తుంది. ఇందు లకు కొంతవఱకూ మన సాంఘిక ఆచారము కారణమని చెప్పొచ్చు. స్త్రీనిఎండముఖము జూడనీయక గృహము నాల్గు

గోడలమధ్యనూ బంధించి యుంచడమే అని నా వుద్దేశ్యము. కాని అసలు స్త్రీలో సుకుమారత్వం వుండదనినే చెప్పను. ఉన్ననూ యింత యెక్కువగా వుండదని చెప్పగలను. స్త్రీకి గూడా పురుషునికుండు హక్కులున్నట్లయితే, స్త్రీ శరీరము ఇంత సుకుమారముగా నుండదు......

కిరణ హృదయంలోని ప్రేమరసం మురళి వైపు ప్రవహించడం మొదలెట్టింది. ఎన్నడూ గాలినైననూ శోకింపని మదనుడు నేడు కిరణహృదయంలో తందనాలు ఆడడ మారంభించాడు. ఆమెలోని ప్రేమ సముద్రానికి అడ్డుగానున్న 'నిగ్రహము' అనే కట్టను త్రోసేశాడు. ఆమె హృదయమంతా ప్రేమమయమైంది. ఇంతకాలమునుంచీ కిరణను సేవకుడిలాగా కాచుకొనియున్న నిగ్రహమును మురళి హృదయం ఛేదించి వైచింది. కిరణ అక్కడ నిలవలేకపోయింది. సూరితో వెళ్లుతున్నానని చెప్పకుండానే చరచరా మెట్లు దిగి తన బసలోకి వెళ్లిపోయింది. మురళి, ఆమెయొక్క సౌందర్యాన్ని, మాట వయ్యారాన్ని, కవిత్వపు ధోరణిలో గానం చేసుకుంటూ తన్మయత్వంలో మునిగిపోయాడు. తనయొక్క మాటకు, కిరణ సమాధానం యివ్వకపోవడం మురళికి విచారసూచకమైనది. స్త్రీకి సిగ్గుఅనేది సహజగుణంకదా అని ఆశాపూరితమైన తన మనస్సుకు సమాధానం చెప్పుకున్నాడు. అతని పాతికేళ్ళ జీవితంలోనూ, అతనికంటికి నచ్చిందల్లా ఒక్క కిరణయే సౌందర్యవంతులగు యువతులను జూచి, తన స్నేహితులతో "ఆమెను చాలా ఎక్కువగా చెప్పుకుంటున్నారు. ఆమె

యొక్క ప్రతి అవయవంలో అందం కనబడుతోంది. అందంఅంటే ఏమిటో అసలు మీకు తెలుసునా?" అనేవాడు. "కవులకు ప్రపంచంలోని అందం చాలదు. వారు ఊహాప్రపంచలో వింత అందాన్ని సృష్టించుకుంటూంటారు" అనేవాళ్ళు అతని స్నేహితులు. బ్రహ్మచారియగు తనకు కిరణ భార్యగా వుంటే!......యీ మాటలు అతని ఊహా వీధిలోకి వచ్చే సరికి శరీరమంతా కంపించి పోయింది. కండ్లు గిరగిర తిరిగి నాయి. ఒక్క నిముసము గడిచిన తర్వాత తటపటాయించు కున్నాడు 'సంఘం...అనుమతి యివ్వదూ!......సంఘం యిచ్చేదేమిటి?......హృదయమిస్తేచాలు...' అంతటితో అతనికి భయం పోయింది. సంఘసమస్య తీరిపోయింది. ఇక తన తల్లితండ్రుల సంగతో? సాధ్యమైనంతవరకూ మన శక్తి నంతా వినియోగిద్దాం వారిని యొప్పించడానికి, ఒప్పకపోతే యింకా చెప్పేదేముందీ! ఎంత దల్లి తండ్రులయితే మాత్రం, నాసుఖానికి అంతరాయం కల్పించే అధికారం వారి కెల్లా అవుతుంది? అతని మనస్సునకు తట్టిన రెండు క్లిష్ట సమస్య లను, రెండు నిముషాల్లో తేలిగ్గా స్వల్ప సమాధానములతో సాల్వ్‌చేయ గలిగాడు...ఇక తన అభిప్రాయమును ఎవరి ద్వారా కిరణకు తెలియపర్చడం...సూరిద్వారానే...సూరి కీవిషయం కష్టంగా వుంటుందేమో!...ఎప్పుడూ వుండదు. వాడు పెద్దపేరుబడసిన సంఘ సంస్కారి. మురళి ఆ యొక్క రాత్రిలో తన భవిష్యత్ యావజ్జీవితమంతయూ ఊహా వీధిలో చిత్రించుకున్నాడు. అతడు ఒక్క కవియేగాదు. చిత్ర

కారుడుగూడా అయ్యాడు అప్పుడు. ఆఅభిప్రాయాన్ని తను దాచలేక పోయాడు మురళి. అసలు దాచుటకు గూడా స్థలం లేదు అతని హృదయంలో. వెంటనే సూరిని కొట్టి నిద్రలేపాడు. సూరి కంగారుతో లేచి కూర్చొన్నాడు. మురళి నేత్రములు చింత నిప్పులులాగా ఎఱ్ఱగా వున్నాయి. ఏదో వాంఛా సముద్రంలో యీదులాడుతూన్నట్లు అతని ముఖం చెపుతూన్నది. మురళి ముఖమున ఏదో వింతకళ ఆవేశించియున్నది. సూరికండ్లు నలుపుకుని దీర్ఘంగా జూచాడు మురళివంక. సూరితో తన వాంఛను చెపుదామని మురళి పెదవులు కదల్చాడు. పెదవులు కదలలేదు. గుండెలు దడదడమని చాలా త్వరగా కొట్టుకోనడ మారంభించినాయి. శ్వాసాశక్తి కొంచెంగా క్షీణించినది. సూరి ఖంగారుగా మురళి ముఖంవంక దీర్ఘంగా జూస్తున్నాడు. సూరికి నిద్రమత్తు తీరింది. చేతినున్న రిస్టువాచి జూచాడు. టైము రెండుగంటల పదినిముసము లైంది. వారిద్దరిమధ్యా ఓ పదిహేను నిముసాలు నిశ్శబ్దంగా గడిచినాయి.

"మురళీ! ఎందుకు నిద్రనుండి లేపావు?" అన్నాడు సూరి నిదానంగా. మురళి తన అభిప్రాయము వెల్లడిజేద్దామని నోరువిప్పి "సూరి......" అని ప్రారంభించాడు. తరువాత వాక్యం సాగలేదు. మురళి నోరు మూసుకుని పోయింది. ఒక నిముసం గడచిన తర్వాత మురళి మళ్ళీ నోరువిప్పాడు. "సూరీ! నేను ఒక స్త్రీని కామించాను." సూరికి అమితాశ్చర్యం వేసింది. మురళి పాతికేళ్ళ జీవితంలోనూ యీ రకమైన మాట

లెప్పుడూ సూరి మురళి నోటినుండి వినలేదు. "స్త్రీ సౌఖ్య మంటే ఏకోశానా గిట్టని మురళి నేడు...ఒక స్త్రీని కామించడం...ఆమె ఏ దివ్యశక్తియో!...ఏ అప్సరసయో...... ఏకళాశక్తియో..." సూరి యీ విధంగా ఆలోచనల్లో మునిగి పోయాడు. ఏ స్త్రీ అవుతేనేం? తన స్నేహితుడు వివాహితుడు కావడమే అతనికల్లా కావలసింది. ఆ రోజుకే అత నెదురు జూస్తున్నాడు. "ఎవరు ఆమె" అన్నాడు సూరి దీనంగా. "ఒక గొప్ప కళాశక్తి" అన్నాడు మురళి శ్వాస పైకి దీర్ఘంగా పీలుస్తూ. "నీవల్ల గొప్ప కళాశక్తి అనిపించుకునే స్త్రీ యీ ప్రపంచంలోనే వున్నదా? లేక నీ మతి భ్రమించినదా? కామించడం తెలియని నీ హృదయానికి యీ నాడు పిచ్చి రేగినదా?"

"కాదు సూరీ! నాకు మతి భ్రమించలేదు. నిజముగనే ఒక కళాశక్తిని కామించినాను. నాకు కామించడం తెలియదని మీరందరూ అనుకుంటున్నారు. కామించడమే తెలియడం గాదు. కామించి సుఖంచడము గూడా నాకు తెలుసు. మీకందరికీ ఒక్క కామించడమే తెలుసు. అదిన్నైనా పూర్తిగా తెలుసని నేను తలచను. కంటికి కనబడిన కొంచెం అందం గల ప్రతి స్త్రీని మీరు కామించుతుంటారు. అందువల్ల మీలో కామించే శక్తి చాలవఱకూ సడలి వుంటుంది. మీ హృదయంలోవున్న కామించే శక్తిని, మీచే కామింపబడే స్త్రీ యొక్క శక్తులను తెల్సుకోకుండా, ఉపయోగిస్తుంటారు. అందువల్ల మీరు సుఖం పొందలేరు. జీవితంలో ముప్పా

తిక పాలు మీరు కామించుతూనే వుంటారు. పదునాలు సంవత్సరముల మొదలు, డెబ్బయ్యో పడి వచ్చినాగూడా మీరు కామించుతూనే వుంటారు. జీవితంలోని కొన్ని కొన్ని సమయములు మాత్రమే కామించుట కర్హాములు. ఆ సమయాల్లోనే సరియైన సుఖం అనుభవించగలం. నాజీవితంలో కామించుటకు అర్హామైన దశ యిది...

సూరి నిలువునా కంపించి పోయాడు. కంఠం రుద్ధమైంది. "మురళీ! పొరబాటుగా మాట్లాడినాను. నీ జీవితాన్ని సక్రమమైన పద్ధతుల్లో నడుపుతూన్నావని యిప్పుడు తెలుసుకున్నాను."

"అయితే, నావుద్దేశ్యమును గురించి నీవు ఏమి సలహా యిస్తావు?"

"ఆ కామిని ఎవరో నాకు చెప్పు. నాకంటే ఆప్తుడు నీకు, నీకంటే ఆప్తుడు నాకు యీవిశాల విశ్వంలో ఎవ్వరూ లేరుకదా?"

"కిరణ......" ఇకపైన చెప్పలేకపోయాడు మురళి. ఏమని చెప్పాలో తెలియలేదు. "ఇది నిజమేనా? చెప్పు మురళీ! నన్ను ఏడిపించుటకు ఇల్లా మాట్లాడుతూన్నావా? నీ సరియైన వుద్దేశ్యం ఏమిటో నాకు చెప్పు. నీవు నిజముగా కిరణను ప్రేమించుతూన్నావా?" అన్నాడు సూరి అమితాశ్చర్యంగా.

"నిజమే. నేను ఆమెను ప్రేమించాను. ఆమెను 'నాది' గా చేసుకొందామని వుంది."

"ఆమెకుగూడా ఆతలంపే వున్నది. ఆమె తప్పక యంగీకరించును. నేను ఆమెతో రేపు విషయమింతా చెప్తాను." సూరి బెక్ మీద వ్రాలాడు. నేత్రములు మూతలు బడ్డాయి. మురళికి కొంచెంగా మనశ్శాంతి కుదిరింది.

మర్నాడు ఉదయమున సూరీ, మురళి కూరగాయల మార్కెటుకు వెళ్లి వస్తూన్నారు. పత్రికల కుట్టాడిదగ్గఱ మురళి 'నవయుగం' ఉగాదిసంచిక కొన్నాడు. పిన్నుతీసి పత్రిక విప్పి జూడగానే కిరణాదేవి పద్యములు ప్రత్యక్షమైనాయి. "సూరీ! చూచావ్! మీ కిరణాదేవి పద్యాలు" అన్నాడు మురళి. "పత్రికను ఎక్కడా పడవెయ్యకు. తనపద్యాలు ప్రకటింపబడ్డాయని ఆమెకు యింకా తెలిసివుండదు. నేను ఆమెకు యీ సంతోషవార్త తెలుపుతాను" అన్నాడు సూరి. ఇంకో రెండుపేజీలు త్రిప్పగానే మురళీకృష్ణ 'మురళీగానము' అనే కథ ప్రత్యక్షమయింది. తనకథను మురళి సంతోషంగా ఒకనాడు పూర్తిగా చదువుకున్నాడు. "మురళీ! నీవు నీరూమ్ లోకి వెళ్ళు. ఆ పత్రిక నిటుఇయ్యి. నేను కిరణను అక్కడకు పిల్చుకువస్తాను......" సూరి నవయుగం పత్రికను తీసుకుని విడిదిదిగిన యింటికి వెళ్లాడు. అక్కడ పదిమంది ఆడవాళ్ళ లోనూ కిరణ కనబడలేదు కిరణ ఒకమూల పెడగాకూర్చొని ఏదో ఆలోచిస్తూ కూర్చొన్నది. సూరి వెతుక్కుంటూ కిరణ దగ్గఱకు వెళ్లి పత్రికను ఆమెచేతి కందిచ్చాడు. ఆమె, ఏదో ఒకవిధమైన చెప్పలేని ఉత్సాహంతో పత్రిక విప్పి జూచింది. 'మురళీగానం' కథ ప్రత్యక్షమైంది. ఆకథయొక్క శీర్షికకు

కొంచెం క్రిందిభాగమున 'మురళీకృష్ణ' యని పెద్దపెద్ద అక్షరాలు చిత్రకళతో తులతూగుతూన్నాయి. కిరణ నిశ్చలమైన మనస్సుతో ఆకథను సాంతంగా చదివేసింది. చదవడం పూర్తి అయ్యాక "సూరీ! ఇదిగో! మీ మురళికథ" అన్నది ఆనంద చిహ్నమైన చూపులతో. "నీకంటె ముందే చూచాను. ఇందులోని నీపద్యాలను జూచి ఆతడు చాలా సంతోషించాడు." అన్నాడు సూరి పైవంక జూస్తూ.

కిరణ పగలబడి నవ్వుతూ "నాపద్యాలు ఆయనకు రుచించాయా? ఆ కవితా కుమారునకు? ..." కిరణ తాను వ్రాసిన పద్యాలు నాలుగైదుమార్లు చదువుకున్నది. సూరి కొంచెంసేపు తనలో తాను ఆలోచించుకుని "కిరణా! నీకు మరల వివాహితవు కావలెనని వున్నదా?" అన్నాడు మెల్లగా.

కిరణ ఆశ్చర్యంగా "ఆ ప్రశ్న యిప్పుడు ఎందులకు రావలసివచ్చినది?" అన్నది.

"మురళి అడగమన్నాడు." అన్నాడు సూరి దృఢంగా.

"మురళి అడుగమన్నాడా? మురళి కెందుకు ఆ ప్రశ్న?"

"ఆవిషయం అతనినే అడుగుదువు గాని, వెళదాంరా!"

సూరీ, కిరణ, మురళి గదిలోకి వెళ్లారు. కిరణను చూస్తూనే మురళి 'కూర్చోండి' అని ఒక పేమ్ కుర్చీని చూపాడు. కిరణ పేమ్ చైర్ మీద కూర్చొని "మీరు ఎందుకో నన్ను రమ్మన్నారట" అంది ఆడవాళ్ళకుండే సహజమైనలజ్జతో.

"నా కోరిక దెలుపుదామని... ..."

"ఏమిటి యాకోరిక?"

"నిర్భయంగా చెప్పొచ్చునా?"

"నిర్భయంగా చెప్పొచ్చు. ఏమి అభ్యంతరం లేకుండా"

"మీా హృదయాన్ని 'నాది' గా......"

"నా హృదయం ఇదివఱలోనే మీాదైపోయింది."

"వివాహం... ..."

"నేను వివాహం జేసుకోను. నేను కళాజీవిని. భర్త అనేవాడు ఒకడుంటే కళాభంగమగును..."

"అయితే ఫ్రీలా (Free love)....''

"సంఘం నాహృదయాన్ని, నాశరీరాన్ని ఒకనివశం జేసింది"

"సంఘం జేసినదిగాని, మీారు జేయలేదుగదా?..."

"నేనూ అతనివశం జేశాను. కాని అతడు తిరస్కరించాడు. నేను ఇప్పటికీ అతన్ని మరువలేదు"

"మీారు అంతగా మరువనట్లుగా, మిమ్మల్ని అతడు ఏవిధంగా సంతోషపర్చాడు?..."

"సంఘంయొక్క ఆదర్శమే అతన్ని యీా జన్మలో మరువకుండా నన్ను జేసింది. కాని అతడుమాత్రం నన్ను ఏవిధానా సంతోషపెట్టి యుండలేదు..."

"నీచుడగు అతనికొఱకై మీా నిండుజీవితాన్ని పాడు జేసుకుంటారా?..."

"పాడుజేసుకోవాలి, తప్పదు. మనసంఘం అటువంటిది. దయాదాక్షిణ్యాల్లేని యీాసంఘంలో అల్లావుండడమే గొప్ప"

కిరణ చరచరా వెళ్ళిపోయింది. మురళి ఆశానది ఎండిపోయినది. అతనిముఖము వాడిపోయినది. అతనిలోని ప్రేమించే శక్తి నశించింది ఇక అతని జీవితమంతా దుఃఖ మయమే. అన్నీ కన్నీటి కెరటాలే!

# 1. దిక్కులేనిబిడ్డ

ఆరోజున లక్ష్మి ఎన్ని ఇళ్లు తిరిగినా ఒక్క ముద్ద భిక్షం పెట్టినవాళ్ళు లేకపోయారు. ఇదివఱకు లక్ష్మి "అమ్మా! ఒక్క ముద్ద వెయ్యండమ్మా!" అని దీనంగా అడగ్గానే విసుక్కుంటూ చీకాకుతో పట్టెడన్నం పడేశేవాళ్లు లక్ష్మిజోలిలో. ఆరోజున ఆమాత్రంకూడా లేకుండా పోయింది. ఏ ఇంట్లో జూచినా 'లేదు' అని జవాబే. మూడో అంతస్థు మేడమీద హంసతూలికా తల్పముమీద పరుండి భర్తతో సరస సల్లాపము లాడుతూ, లక్ష్మి కేక తమ సంతోషానికి అంతరాయం కల్పించిందో యన్నట్లు, "ముద్దా లేదు, లద్దా లేదు. ఏమిటీగోల ఎప్పుడూను. మాయగోల. ఈబస్తీల్లో ఇదొక చావమ్మా! పో! వెళ్లు" అని గంభీరంగా పలుకు పడతులు కొందరు, రూపాయిలకు రూపాయిలు కాఫీ దేవాలయాల్లో తేలికగా వెచ్చించి మీసములు మెలిపెట్టుకుంటూ మెనేజరు వద్ద క్యాషుని చెల్లించుచుండ, లక్ష్మి యాచన తమగౌరవమునకు భంగము గలిగించునట్లో ఆయన "పోవే అవతలకు, దగ్గఱకు రాకు" యని అసహ్యముగా బల్కు శ్రీమంతులు కొందరు, కోటు, హ్యాటు, సూటులను ధరించి స్వజాతీయతను మంటగల్పి, స్పెక్టికల్సును జేబుగుడ్డతో మాటిమాటికి తుడుచుచు, భూమి అదిరిపోయేటట్లు బూట్లచప్పుడు టక్ టక్ మనిపించి నడచుచూయున్న విలాస పురుషులగు యువకులు, తమ షోకునకు లక్ష్మి యొక్క యాచన కొఱదల కల్గించినట్లు "ఛా!

రాస్కెల్. డన్సు." అని కోపంతో అదరాయించే యువకులు కొందరూ. ఆరోజు ఉదయానే ఎవరి మొగం జూచిందోగాని ఎక్కడికి వెళ్లినా 'నాస్తి' అను పదమే ఎదురయింది. లక్ష్మికి కడుపులో ఆకలిమంట తీవ్రంగా మండుతోంది. శ్రీమంతులు, విలాస పురుషులు, కాఫీహోటళ్లకనీ,కల్లీలకనీ, సిగరెట్లకనీ అనేక విధాల వ్యర్థపు ఖర్చులన్నీ పెడతారు. అవును తమరు కష్టించి సంపాదించినదా తేగదూ, దాని విలువ దెలిసేది! దేశసౌభాగ్యమునకు పునాదియైన రైతు కష్టించి చెమటోడ్చి, తమ రక్తబిందువులను జలబిందువులుగా మార్చి, ఆ ఫలితములో పదియవవంతైననూ తామనుభవింపక శ్రీమంతుల చేతుల్లో పోస్తుంటే; వారు ఆధనముయొక్క విలువను తెలుసుకొనక పాత్రల్లోనుంచి త్రవ్వకొచ్చినట్లు అతితేలికగా రకరక భోగములకు వెచ్చించుచున్నారు. తమకడుపులను కార్మికుల కష్టఫలితములతో నింపుకొని ఇంద్రభోగముల ననుభవించుచూ, ఆకలిమంట కాహుతియగుచున్న కార్మికులను కన్నెత్తియైననూ జూడని శ్రీమంతులు, జమీందార్లూ,—వీరియొక్క హృదయములు ఇనుముతో తయారయినవా? లేక ఉక్కుతో తయారైనవా? 'తినికూర్చున్నమ్మకు కూనలమ్మ పదాలని' రైతుల హక్కుల స్థానమునకు పోటీచేస్తూంటారు. వీరికి హృదయముందా? లేదా? కడుపుకు కట్టుకొనియున్న జోలిలో పడుకుని ఆకలిమంటచే ఏడుస్తూన్న అయిదు నెలల పసికందును ఆడిస్తూ ఆజోలిని వూపుతూ, వెల్కంహోటలు యొద్దనున్న పెట్టెదుకాణమందు ఒకషోకుపురుషుడు సిజర్ పెట్టె కొంటూం

డంగా, లక్ష్మి అటకువెళ్లి "బాబూ! యీరోజు ఒక్క దమ్మిడీయైనా దొరకలేదు, మీదయ" అంది చెయ్యిజాపి. ఆపురుషుడు లక్ష్మివంక కన్నార్పకుండా ఒకేతీరుగా పదినిము సాలు పాటు జూచాడు. జవాబు చెప్పడుగదా! ఒక దమ్మిడీ యైనా యిస్తాడేమోనని అతని దుర్మార్గపు దృక్కులను లక్ష్మి పరికించకుండా తలవంచుకొని నిలవబడింది. ఆపురుషునికి తన యందు దయకలిగి గాబోలు అని దేవునికి మనములో అనేక వందనము లర్పిస్తూ అతనివద్దనుండి వచ్చే ఎట్టిరాగిడబ్బుకై ఆమె నిరీక్షిస్తోంది. లక్ష్మివంకజూచి జూచి ఆయువకుడు "నీవు భోజనంచేసి ఎన్నిరోజులయింది" అన్నాడు. "తెల్లారిన తర్వాత కూడు లేదండీ బాబూ" అంది. "ఇదిగో! ఆకనబడు తూన్న ఇంట్లో ఒక గదిలో నేనున్నాను. గిన్నెలో కొంచెం అన్నంవుంది. పెడతాను వస్తావా?" అన్నాడు. "అంతకన్న నాకెక్కువేముంది బాబూ. వస్తా" నంది. ఆరోజున సాయం త్రం నాలుగంటలకు శెలవుగా కూడుపెడతానన్న మహాను భావుడు కంటబడేసరికి ఆమెకు ప్రాణం లేచొచ్చింది. అతడు తనపాలిట భగవంతుడే ననుకుంది. ఆమెను అతడు ఒక మేడ లోని బయటగదిలోకి తీసుకెళ్లాడు. ఆకలిదేవతను బాసేభాగ్యం కలిగిందికదా అని ఆమె సంతోషించుచూ జోలిని విప్పకుని ఆగదిలో ఒకమూలన కూలబడ్డది. ఆగదిలో ఆమెకు ఎక్కడా వంటసామాను కనుపించలేదు. పుస్తకాలతోనిండిన బీర్వాలు మూడు నాలుగున్నాయి. ఇది మాయ అనుకుంది లక్ష్మి, కాని మరుక్షణంలోనే ఆతలంపుమారింది. ఇతడెవరో విద్యావంతుడు

లాగా వున్నాడు. దుష్కృత్యానికి తెగిస్తాడా అనుకుంది. రంగారావు, బయటవరండాలోకెళ్లి కాసేపు షికార్లుకొట్టివచ్చాడు. "ఏమండి బాబూ! కూడేదండి?" అన్నది లక్ష్మి. రంగారావు విచారంగా నటిస్తూ "వున్న కాస్తకూడూ దాసీది తీసుకెళ్లింది గాబోలు. గిన్నెలో అన్నం వుందనుకుని నీతో మాట చెప్పాను" అన్నాడు. లక్ష్మికి ఆశ నిరాశయింది. సంతోషం దుఃఖంగా మారింది. "మాయధారిరోజు" అని ఒక్క వేడి నిట్టూర్పు విడిచింది. "అయితే వస్తానుబాబూ" అని లక్ష్మి జోలిని కట్టుకుంటోంది. రంగారావు మెల్లగా తలుపుగడియ పెట్టాడు. లక్ష్మి, రంగారావు వంక దీనంగాజూస్తూ "తలుపు వేస్తారు ఎందుకండి. నేను వెళతానుబాబూ" అంది. స్టాండున తగిలింపబడియున్న బ్లూబ్లేజరు కోటులోపలి జేబులోనుండి రంగారావు ఒక అర్ధరూపాయి బిళ్ళనుదీసి లక్ష్మిమీద విసరాడు, ముందు విషయం ప్రారంభం చేయడమెలాగా అని ఆలోచిస్తూ. లక్ష్మి తలుపు వేయడంతోనే బెదిరిపోయింది. దీనితోమరీ బెదిరింది. లక్ష్మి ఆశ్చర్యంతో "యీ అర్ధరూపాయి యెందుకండినాకు. మీకు నాయందు దయవుంటే ఒక కానీయివ్వండి. ఈరోజు జరుగుతుంది. ఇకముందు నా నిత్య జీవనమే నాకు ఆధరువు" అంది. "యీ ఒక్కరోజేమిటి? ప్రతిరోజూ, నీకూ, నీకుఱ్ఱాడికీ ఏవిధమైన లోపమూలేకుండా. సంరక్షిస్తాను" అన్నాడు రంగారావు దుర్మార్గపు చూపులతో బాబూ! నేను కేవలమూ ఒకరిచేత రక్షింపబడేదాన్నిగాను. ఈవిశాల మానవప్రపంచములోని మానవసమూహం అందరి

చేతా సంరంక్షింపబడేదాన్ని. మానవసమూహంలో అందరి యొక్క ధర్మమూ నాయందిమిడియున్నది. నన్నూ, నాపిల్లాణ్ని, మీరొక్కరే సంరంక్షించడమెందుకు?" అంది లక్ష్మి. లక్ష్మిగుండె తీవ్రంగా కొట్టుకుట్టోంది. భగవంతుడు ఏకష్టం తెచ్చిపెట్టుచున్నాడోగదా అని తనకు రాబోయే కష్టాలను నివారించమని దేవుళ్లనూ, దైవాలనూ, ఎన్నోవిధాల ప్రార్థించడం మొదలెట్టింది. రంగారావు ఆమెదగ్గరకువచ్చి ఆమె గడ్డం పట్టుకొని "నాకోర్కె తీర్చవు" అన్నాడు. ఆమెగుండె యిదివరకు కంటె యింకా తీవ్రంగా కోట్టుకోడం మొదలెట్టింది. ఆతని కరస్పర్శ ఆమెకు ఎంతో అపవిత్రంగా దోచింది. గడ్డంమీద తేలు కుట్టినంత బాధ తోచింది. "ఏమిటీ నీకోర్కె?" అంది లక్ష్మి నెమ్మదిగా తన నేత్రముల వెంబడి బాష్పకణములు రాలుస్తూ. ఎదురుగా గోడమీద తగిలించియున్న ద్రౌపదీ మానసంరక్షణ పటంమీద దృష్టినిలిపి "ఓ దేవా ఆసాధ్విని గాపాడినట్లు నన్నుకూడ గాపాడుము. ఓ భారతమాతా! నీయొక్క పుత్రికమీద నీదృష్టిని ప్రసరింపుము. నాశీలరక్షణ, నామానరక్షణ, నా పాతివ్రత్యరక్షణ జేయుము. నావల్ల నాపతి జీవితమునకు చెడుమచ్చ తెచ్చిపెట్టకుము." అని తన మనస్సులో ప్రార్థించడం మొదలెట్టింది. ఆమె నేత్రములనుండి ప్రవహిస్తూన్న జలప్రవాహములో భర్తయొక్కచిత్రం తేలుతూన్నట్లు కనబడింది. "నన్ను నీవాణ్నిగా జేసుకో" అన్నాడు రంగారావు. లక్ష్మి కర్ణములకు తన రెండుచేతులనూ అడ్డుపెట్టుకుని, ఆపాపవాక్యము

లను సగమువఱకూ విన్న తన కర్ణములు పవిత్రము కావలె నను యుద్దేశ్యముతో దుఃఖముచే సన్నగిల్లిన కంఠస్వరముతో "రామ, రామ" అని అన్నది. ఏనాడో గజేంద్రుడు విపత్తు నందు యెలుగెత్తి పిల్చినంతమాత్రాన పరమేశ్వరుడు ఆతని విపత్తును తప్పించినాడని మన పురాణాల్లో వింటూన్నాం; యీ సనాతనాభిప్రాయాన్నే నమ్మింది లక్ష్మి. రంగారావు తన బాహావుల్లో యిరికించుకున్నాడు లక్ష్మిని. లక్ష్మి అతని బాహావుల్లో పెనుగులాడింది. ఏంలాభం? ధనబలంచే మదించి యున్న యీదుర్మార్గుని బలములో, భిక్షుపుకూడుచే జీవించెడి లక్ష్మియొక్క బలము యెన్నోవంతు? "రామ, రామ" యని యఱచుచూ నేత్రములను మూసింది. ఏడీ రాముడు? ఆమె శీలరక్షణమును ఏమాత్రం చేయగలిగాడు రాముడు. ఇప్పటి పేదలస్థితినిబట్టి, దేవుడుగూడా శ్రీమంతులకే అనుకూలంగా వున్నాడని తోస్తోంది. ఆమె కళ్లు మూసుకున్నప్పుడు తన భర్త 'యింత దుర్మార్గపు పనిచేస్తున్నావా?' అని కత్తిని చేబట్టినట్లు ఒకప్రక్కను, ఇంకొకప్రక్క భారతమాత విల పిస్తూ 'ఓపిల్లా! నన్ను నిష్కళంకిగా జేస్తూన్నావా?' అని అన్నట్లు ఇంకొక ప్రక్కనూ, చరిత్రప్రసిద్ధులగు విమలావతి, అహల్యాబాయి, దుర్గావతి మొదలగు హైందవ వీరవనితలు మాకు అపకీర్తి దెచ్చుచున్నావా? యని హుంకారిస్తున్నట్లు ఆమెకుదోచింది. అహాహా! ఆ చిత్రముల సహించలేక నేత్రము లను తెరువగానే, రంగారావు చేయుచున్న దుష్కృత్యము నకు ఆమె హృదయం ద్రవీభూతమయ్యేది. రంగారావు ఆమె

శరీరాన్ని యిష్టమైనంతసేపు ఉపయోగించుకున్నాడు. ఒక గంటసేపైన తర్వాత తలుపు గడియతీసి "పో వెళ్లు" అన్నాడు. లక్ష్మి జోలికట్టుకుని అందు తన ప్రియమగు పుత్రుని నిడుకుని గదిలోనుండి బయటికొచ్చింది. ఆమెకు ప్రపంచము అంధకారమయమైనట్లు దోచెను. యీప్రపంచము నందలి జనులందరూ కింకరులలా దోచారామెకు. లక్ష్మి ఏ ప్రదేశమునకనీ నిశ్చయించుకోనకుండా మెల్లగా నడవడం మొదలెట్టింది. అపవిత్రము, కళంకమూ ఐన యీబొందెలో నిలుచుట కిష్టపడలేధాజీవి. ఇక తన అవతారాన్ని యింత టితో చాలించాలనుకున్నది. సాయంత్రం ఆరుగంటలైంది. మదరాసు సముద్రపొడ్డు అనంతశోభాయమానంగా వుంది. ప్రేయసీ, ప్రియుల సంభాషణలతోనూ, రతీమన్మధులను ధిక్క రించు యువతీ యువకులతోనూ, చక్కని మందమారుతము తోనూ నిండియున్న బీచియొక్క సౌందర్యమేమని చెప్పవల యును? అలలు సముద్రతీరాన్ని ముద్దుపెట్టుకుని, మళ్లీ వెంటనే తిరిగి వెళ్ళిబోతున్నాయి. రేడియో ధ్వని బీచిఅంతయు ప్రతి ధ్వనించుచున్నది. సూర్యుడు ఎరుపురంగు ముఖముతో పశ్చి మంగా లజ్జతో తలవంచుకున్నాడు. పొడుపుకొండపై చంద్ర బింబము చూచాయగా గానవచ్చుచున్నది. ధృవనక్షత్రం అప్పుడే ఆకాశంమీాదకు వచ్చింది. ఇట్టిసమయమున సముద్ర పొడ్డున ఎంతమందో జనులు ఎన్నోవిధములుగ సంతోషము పొందుచుండ, ఒక్కనిర్భాగ్య జీవి మాత్రము నేత్రముల వెంబడి నీరుకారుసూ, తన కడుపున కట్టుకునియున్న జోలి

లోని బాలకునివంక జూచుచూ "ఓపరమేశ్వరా! నా మొరాలకించవైతివి. నాశీలరక్షణ జేయవైతివి. నాయందు కాఠిన్యము వహించితివి. నేను పుట్టిననాటినుండి కష్టములే. ఒకనాడు సుఖమూ లేదు, ఒకనాడు కష్టమూలేదు. ఎప్పుడూ కష్టములే. నాజీవితంలో సౌఖ్యమేదీ! చివఱకు నా అంత్యదశ కూడా చాల అవస్తతోనే గడచుచున్నది. పోనిమ్ము యీ కుఱ్ఱవానినైననూ గాపాడుము. హతవిధీ! యీపసికందుకు నీవే తల్లివి తండ్రివి దైవము అన్నియూ నీవే" యని ప్రార్థించుచూ, సముద్రపొడ్డున బడియున్న ఒక కొయ్యమీద కూర్చొని జోలివిప్పుకుంది. పసికందును చిన్నగుడ్డలోజుట్టి కొయ్యమీద పెట్టింది. ఆపసికందును విడిచెళ్లుదామని ఆమె ఎంతో ప్రయత్నం చేసింది. రెండు అడుగులు వేసేసరికల్లా, ఆమె హృదయంలో పుత్రవాత్సల్యం పొంగిపొఱలింది. మళ్ళీ పిల్లవాడిదగ్గఱకొచ్చి ముద్దుపెట్టుకుని కన్నీరుకారుస్తూ రెండు అడుగులు వేసేసరికల్లా ఆమెకు కాళ్ళాడేవికావు. ఇదే గర్భతీపి, ఇదే పుత్రవాత్సల్యం. చివఱకు ఆమె పుత్రవాత్సల్యాన్ని గూడా వదలుకుని బలవంతముగా నడచుచూ "ఛీ! ఇక బతకరాదు. ఇదివఱకు నేను భిక్షిణినైననూ పవిత్రవతిని, శీలవతిని. ఇప్పుడో కళంకము గలదాన్ని. కులటను. ఆదుర్మార్గుడు తన కామాదాహానికి నన్ను పాత్రగా ఉపయోగించుకున్నాడు. ఈ లోకంలో నామాట ఎవరు విశ్వసిస్తారు ? యీ లోకంలోని అన్నిసౌఖ్యాలూ శ్రీమంతులవే" అని అంటూ సముద్రంలో దిగింది. ఆమె యొక్క సర్వప్రేమ రస

ములూ ఆపిల్లాడివైపు ప్రవహిస్తూన్నాయి. ఆపిల్లవాడివంక మరోసారిజూచింది. పిల్లవాడు కెవ్వున కేకవేసి యేడుస్తున్నాడు. ఆమె సముద్రంలో నడిచివెళ్లిపోయింది. కొంతదూరమెళ్లేసరికి సముద్రపుకెరటాలు ఆమెను యెక్కడికో తీసుకెళ్లినాయి. ఆరోజు రాత్రి తెల్లవార్లూ చలికి పిల్లవాడు బిగదీసుకుపోయాడు. మర్నాడుదయం పదిగంటలకు ఆపిల్లవాడ్ని సముద్రంలో చేపలుపట్టేవారు జూచారు. చాలమంది పోగయ్యారు. "పాపం! పిల్లవాడు బంగారు బొమ్మలావున్నాడు. ఆపిల్లాడ్ని చూచుకుని సంతోషించే భాగ్యం ఆతల్లికి లేకపోయింది" అని కొందరూ, "దిక్కులేనిబిడ్డ" అని నాలుకచప్పరించే వాళ్లు కొందరూ, యీవిధంగా అనేకమంది విచారించడం మొదలెట్టారు.



# 2. ఇదేనా న్యాయం?

సుబ్బాయి, లక్ష్మీనారాయణగారి ఇంట్లో రెండు మూడు తరములనుంచీ కమతం పనిజేస్తూన్నాడు. వారి గృహవిషయములు సుబ్బాయికి తెలియనివిలేవు. మొదటి నుంచీ, అనగా తన పదునైదవ సంవత్సరమునుంచీ లక్ష్మీనారాయణగారింటనే పాలేరుగావుండీ, వారి సొమ్ము వల్లనే తన శరీరం వృద్ధికావడంవల్ల, వారికుటుంబాన్నిజూస్తే వాడికి అమిత అభిమానం, అమిత విశ్వాసం. తన శరీరమంతా వారు పెట్టిన పట్టెడన్నంతోనే వృద్ధియయిందని అతని నమ్మకం. అమాయకులగు కూలిజనమంతా యీవిధంగానే తలుస్తూంటారు. ఒక్కనాడు పట్టెడన్నం పెడితే వారిపేరు ఎన్నభైమార్లు చెప్పుకుంటారు. అల్పసంతోషులు. తన పదునైదవ సంవత్సరమునుంచీ యిప్పటివఱకూ అనగా తన అరువదియవ సంవత్సరమువఱకూ, లక్ష్మీనారాయణగారి సొమ్ము వల్లనే తను జీవిస్తూన్నా ననుకుంటాడుగాని, యింతకాలమూ తమ యజమానిగారింట చేసిన పనికి యిది ఫలితమని తలపడు. యజమానిగారి యెడల ఎంతవిశ్వాసమో, యజమానికిగూడా తన యెడల అంత విశ్వాసముగలదని అమాయక జీవియగు సుబ్బాయి వుద్దేశ్యం. యజమాని తేనెపూసినకత్తియని యెరుగడు. తమ యజమానియింట కమతంచేసిన పనికి ఫలితంగా యిచ్చేసొమ్ము ఎంతకడుపుమంటతోనూ, ఎంతపడుపు

తోనూ, ఎంత ఈర్ష్యతోనూ, యిస్తూన్నాడో సుబ్బాయికి తెలియదు. యజమాని ఇంట తను చేసినపనికి ఫలితంగా న్యాయంగా యివ్వవలిసిన సొమ్ములో నాలుగోవంతు యిచ్చి ననూ సుబ్బాయికి సంతోషంగా నేవుంది. తాను జేస్తూన్నపని యెంత విలువజేస్తుందో సుబ్బాయికి తెలియదు. ఇచ్చిన దానితో తృప్తి. యజమానికి తనయెడల ఎంతో దయగలదను కునేవాడు

* * *

సుబ్బాయి రెండవ కుమార్తె వివాహమొచ్చింది. సుబ్బాయిచేత దమ్మిడీ లేదు. ఏరోజు సోలెడువడ్లు ఆరోజునే సరిపోతుంటే వాడిచేతిలో డబ్బు ఎలావుంటుంది. ఈ అమిత దారిద్ర్యం వల్లనే వివాహం చెయ్యకుండా పిల్లను పదునాలుగు సంవత్సరాలు పెంచాడు. మాలపల్లెలో ఆక్షేపణగావుంది. అందరూ దుయ్యబట్టు కుంటూన్నారు. వాడికేమీ తోచడం లేదు. మనోవ్యధగా వుంది. పిత్రార్జితమూ ఏమీ లేదు, ఒక చిన్నగుడిసె తప్ప. ఆగుడిసెను కాస్తా అమ్ముకుంటే నిలవ డానికి నీడ లేదు. ఈఅవస్థలన్నీ క్రైస్తవ మిషనరీవాళ్లు కనిపెట్టి, క్రైస్తవమతం పుచ్చుకుంటే రెండు వందల రూపాయి లిస్తాం అని కబురుచేశారు సుబ్బాయికి. డబ్బుకాశించి మతం మార్చుకోనన్నాడు సుబ్బాయి. యింకా వివాహం నాలుగు రోజులుంది. ఎంత బీదగాజేసినా యిరువై రూపాయలకు తక్కువకాదు. ఇరువై రూపాయలు కాదుగదా యిరవై దమ్మి డీలు గూడా వాడిదగ్గఱలేవు. వివాహం గూడా చేయలేని

యీ దౌర్భాగ్యానికి దేవుడు ఆడపిల్లలను ఎందుకు ప్రసాదించాలని ఎంతో దుఃఖించే వాడు. యజమానిదగ్గిరే రెండుసంవత్సరాలు సరిపడ ఒకేసారి డబ్బు తీసుకుందా మనుకున్నాడు. వాడికా వుద్దేశ్యం ఏమీ ఒడుకుమడుకులు లేకుండానే తట్టింది. తప్పకుండా తనకోరికను యజమాని నెఱవేర్చి తీరుతాడనుకున్నాడు.

ఆరోజు సోమవారం. ప్రతిసోమవారమూ లక్ష్మీనారాయణకు తన భూములను చూచుకోడం అలవాటు. ఆరోజున, గూడా భూములదగ్గఱకు వెళ్ళుటకు బయల్దేర బోతున్నాడు. సుబ్బాయి ద్వారంధగ్గఱ నిలబడి "బాబూ!" అని కేక వేశాడు. యజమాని లోపలనుంచి గుర్రెఱ్ఱ జేసుకుంటూ "ఏం!" అంటూవచ్చాడు. యజమానియొక్క భయంకర నాదమును, గంభీరమైన ముఖమును జూచేసరికి సుబ్బాయి నోట మాట రాలేదు. రెండునిముషాలు నిశ్శబ్దంగా గడిచాయి. "ఎందుకు వచ్చావ్." అన్నాడు యజమాని బిగ్గఱగా.

"అయ్యా! నా రెండవకుమార్తె వివాహం నిశ్చయం చేసుకున్నామండి. రెండు సంవత్సరాల పనికి ఒకేసారి డబ్బు యిస్తే యీ వివాహము గడుస్తుంది" అన్నాడు సుబ్బాయి తడబడుతూన్న కంఠంతో.

"బాగానేవుంది. రెండు సంవత్సరాలకీ సరిపడగా ఒక్కసారే యిస్తే, యీ రెండు సంవత్సరాలూ పనిచేస్తావని మాకు నమ్మకం ఎలా? ఈలోపల డబ్బు ముట్టిందిగదా యని పనిలో నుంచి నీవు వెళ్లిపోతే, మాకు నష్టంగాదూ! అదీగాక

నీవు కడజాతివాడివి. నిన్ను నమ్మగూడదు" అన్నాడు యజమాని. "యజమాని యింత నిర్కర్షగా మాట్లాడతాడని సుబ్బాయి అనుకోలేదు. ఈయజమాన్లు కడజాతి వారలగు కూలీలను నమ్మగూడదంటారు. తమ తప్పులు తామెరుగరు. కూటికీ, గుడ్డకూ, లేక మలమల మాడుతూన్న కార్మిక కర్షకులను మోసగించి ధనమును కూడబెట్టుకొను యజమాని, తాను కార్మిక కర్షకులను మోసగించుతూన్నది యెరుగడు. కార్మిక కర్షకులే తన్ను మోసగిస్తారని తలుస్తాడు. సత్యానికీ, న్యాయానికీ దయకు స్థానం లేనట్టువంటి యజమానుల కఠిన హృదయాలు ఎంత మోసమునైననూ జేయిస్తాయి. ఎంతభయోత్పాతమైన పనినైననూ జేస్తాయి. ఆకర్కశ హృదయాలకు నీతి నియమములుండవు, ఏవిధంగానైనా సరే దమ్మిడీ చేతిలోపడితేసరి. తాను, ఎంతమంది కూలి జనము యొక్క కష్టం యొక్క ఫలితంగా సుఖపడుతున్నాడో లక్ష్మీ నారాయణకు తెలియదు. ఆ విషయం కనుక తెలిస్తే, ఎంత మందో రైతులనోట మన్నుగొట్టి ఎంతోమంది కూలీలు విధి విరామం లేకుండా వారివారి రక్తమునంతా, తన లాభము కొఱకై జలముగా మారుస్తూ తానిచ్చిన స్వల్పానికే తృప్తి పొందుతూన్ననూ, వారికిస్తూన్న ఆస్వల్పానికిగూడా ఏడవనే ఏడవడు. యజమాని మాటలు చెవినిబడేసరికి, సుబ్బాయి యొక్క చరిత్రము, నిష్కళంకమయిన హృదయద్వయమున గాఢతమమగు గాయము తగిలినది. ఆమాటలు సుబ్బాయి హృదయమున శూలములై తగిలాయి. "నమ్మకంలేని పని

నాజీవితంలో నేను ఏంజేశాను" అని తలపైకెత్తి ఆలోచించాడు సుబ్బాయి. యజమాని మాటలు సుబ్బాయికి కొంచెం ఆగ్రహాన్ని కలిగించాయిగాని "వారు ధనవంతులు. వారు దేనికైననూ తగుదురు. ధనవంతులకున్న గౌరవము, ప్రాముఖ్యత, యీ విశాలవిశ్వంలో బీదలకుండదు" అని తన మనస్సుకు సమాధానం చెప్పుకుని ఆగ్రహాన్ని అణచుకున్నాడు. "బాబయ్యా! నేను మూడుతరములనుంచీ మీఇంట కమతం పని చేస్తున్నాను. నేను నమ్మకంలేని పనులెప్పుడూ చేయలేదు, అంతవఱకూ ఎందుకు? మీహయాంలో ఇరువై సంవత్సరాలనుంచీ పనిచేస్తూన్నాను. ఎప్పుడైనా నమ్మకంలేని పని చేయగా మీరు చూచినారా? నమ్మకమే నాజీవితలక్ష్యము. అట్టి నమ్మకంవల్లనే నాజీవితచక్రం యీనాటివఱకూ తిరుగుతోంది. నాయందు దయయుంచి మీరు రెండు సంవత్సరాల సొమ్మూ ఇప్పుడిస్తే, మా వివాహం మీధర్మాన గడుస్తుంది." అన్నాడు సుబ్బాయి దుఃఖభారమైన హృదయంతో.

"డబ్బులేదు; ధాన్యమూ లేదు. డబ్బు ఇక్కడ పాతరపోసివుండలేదు. వెళ్లు" అన్నాడు లక్ష్మీనారాయణ.

సుబ్బాయి అమితదుఃఖంతో "డబ్బుదగ్గర మీకెంతో పట్టుదలగా వుంటుంది. మేము మాత్రం వెట్టిచాకిరిచెయ్యాలి" అని మనస్సులో అనుకుంటూ ఇంటికొచ్చాడు. మా లక్ష్మి సుబ్బాయి కెదురుగావచ్చి "దొరగారు ఎంతడబ్బు యిచ్చారు" అంది చిరునవ్వు నవ్వుతూ. "ఇన్నాళ్ళనుండి పెట్టుకున్న ఆశ యీ రోజున నిరాశఅయింది. నాదగ్గరేంలేదు పొమ్మన్నా"

డన్నాడు సుబ్బాయి. "అయితే యీ కార్యక్రమం గడవటం ఎలా ?" అంది మా లక్ష్మి. "నాకూ ఏమి తోచుటలేదు. యజమాని డబ్బు యివ్వకపోగా మన కడజాతివాళ్లను దూషించాడు. వీరిదగ్గఱ మనం మెప్పుదలను పొందలేం. ఒళ్ళు వంచి ఎంతచాకిరి చేసినా ఏమీ లాభంలేదు. కష్టంచేసేది మనం. యీ కష్టముయొక్క ఫలితాన్ని అనుభవించేది యజమానులు. ఈ యజమానులు బీదల కష్టార్జితమును భుజించి మత్తిల్లి కన్నుగానక యున్న ధనమదాంధులు. కాయకష్టములవల్ల సంపాదింపని ఆహారమును భుజించుట కెవ్వరికినీ హక్కు లేదు. దేశంలో ధనమంతా వడ్డీవ్యాపారములు, వర్తకం, యినాందారు మొదలగు మిషలతో ఒక్కొక్కచోట కుప్పలుకుప్పలుగా చేరుతోంటే యింకా మనకు తింటానికి తిండీ, కట్టుటకు గుడ్డా యెక్కడనుంచి వస్తుంది. అసలే మన హిందూదేశము దారిద్ర్య పీడితమైయుంది. అందులో దేశమునిండా జమీందార్లు, శ్రీమంతులు. హిందూదేశానికి స్వరాజ్యమొస్తే వీరి పని హుళ్ళక్కి అవుతుందని యీ జమీందార్లకు, యీ ధనవంతులకూ భయమే. పార్టీలనియమించి దేశస్వాతంత్ర్యసాధనమైన కాంగ్రెస్ సంస్థయొక్క పలుకుబడిని తగ్గించాలని వీరు ప్రయత్నాలు చేస్తూవుంటారు. లంచాలిచ్చి ప్రజలదగ్గర వోట్లు తీసుకుని దేశంలోని రాజకీయ సంస్థలన్నిటినీ ఆక్రమించాలని వీరుద్దేశ్యం. ఎలెక్షన్ ఎడ్వర్‌టైజ్‌మెంటుకు, లంచాలకు ఖర్చు పెట్టే డబ్బుపెట్టి కార్మిక కర్షకుల ఉపయోగార్థం ఖర్చుపెడితే ప్రజలు త్రికరణశుద్ధిగా వోట్లు యిస్తారుకదూ ! జమీందా

ర్లకు, శ్రీమంతులకు కార్మికకోద్యమం చాలా వ్యతిరేకం. యీ విశాల విశ్వాన వారి ఆశయములు, వారి వుద్యమము (జమీందారి వుద్యమం) వుత్తరధృవమున; కార్మికోద్యమం దక్షిణధృవమున తన కడుపు నిండి తేచాలు. తాను పంచభక్ష్య పరవాన్నములతో భోజనంచేసి నాలుగో అంతస్థుమీాద పందిరి పట్టిమంచం మీాద పడుకోవాలి. ఆ మేడక్రింద, బీదలు "అన్నమో రామచంద్రా" యని యేడ్చినాసరే మూసినకన్ను తెరువకూడదు. యెంతవఱకూ స్వార్థం. యెంత వఱకూ బీదవానికున్న కొద్దోగొప్పో తనకు రావాలంటాడు గాని, ఆ బీదవాడు పైకొచ్చే వుపాయం ఆలోచింపడు. ఇవీ జమీందారోద్యమం యొక్క ఆశయాలు. దేశం లోని బీదలు తిండికిలేక డొక్కలు లోపలకు తోసుకొని పోయి మలమల మాడుతున్నారు. అట్టి వారికి ముందు తిండి దొరికేటట్లు చేయాలి—ఇవీ కార్మికోద్యముయొక్క ఆశయాలు........." అని సుబ్బాయి చెప్ప బోతుండగా యజమానిగారి గుమాస్తా ద్వారందగ్గఱ నిలబడి "సుబ్బాయి! నిన్ను అయ్యగారు ఒకసారి రమ్మన్నారు" అని చెప్పి వెళ్లిపోయాడు. మరల యేమైనా యజమానిగారికి తనమీాద దయగలిగిందేమో నని కళ్లు చేతబట్టుకొని మెల్ల మెల్లగా అంధకారంలో నడవడం మొదలెట్టాడు. "ఏరా! సుబ్బాయ్! నీకు పిత్రార్జితమేమున్న" దన్నాడు యజమానియగు లక్ష్మీ నారాయణ మంచికీవితో. "అయ్యా! ఒక చిన్న పూరిగుడిసె మాత్రం వుంది" అన్నాడు సుబ్బాయి. "నీకు డబ్బు కావా

ల్సుంటే ఆపూరి గుడిసెను నాకు తాకట్టుపెట్టు” అన్నాడు యజమాని. యీమాటలు సుబ్బాయికి హృదయవిషాదం గానే దోచాయిగాని, అంతకుతప్ప విధిలేదు, “మీదయ బాబూ!” అన్నాడు సుబ్బాయి. చేతులుకట్టుకుని కార్యావసరానికి కర్కుక్తిపడితే, తరువాత నిలవడానికి నీడకూడా లేకుండా అనుభవించే కష్టాలన్నీ అతనికి ఆక్షణాన కంటగట్టినట్టుగా కనబడ్డాయి. “నూటికి 1-8-0 వడ్డీ చొ॥ ఒక సంవత్సరంలో పైకం యిచ్చేటట్లు, సంవత్సరం దాటితే తాకట్టు నాకట్టు చెల్లు” అన్నాడు యజమాని. ఈ హిరణ్యాక్ష వరాలన్నిటినీ వినేసరికి సుబ్బాయికి గుండెబ్రద్దలైనట్లయింది. “బాబూ! మీలాంటి భాగ్యవంతులు, మాలాంటి నిరుపేదల మీద అల్లాంటి తీక్షణమైన బాణములను విసరితే ఎలాగు చెప్పండి!” అన్నాడు సుబ్బాయి. “నువ్వేమన్నాయిక లాభం లేదు. చాలా కాలంనుంచీ మాఇంట కమతం పనిచేస్తూన్నావనీ, వయోవృద్ధుడవనీ దయదలచి ఇంటిదగ్గఉనున్న వాడిని పిలిపించి ఏదోవిధంగా ఫైసలుచేసి డబ్బుయిద్దామంటే, నీవేమీ వినేటట్టుగాలేవు. నేను చెప్పినట్లుగా చేస్తే చెయ్యి, లేకపోయినయెడల నావాకిలి త్రొక్కవద్దు.” అన్నాడు యజమాని. “సరే! అలాగే చేయండి” అన్నాడు సుబ్బాయి. వాడి గంభీర హృదయ సముద్ర మనిర్వచనీయమైన దుఃఖతరంగాతిరేకమున నుఱ్ఱూతలూగెను. “అబ్బా! యీ శ్రీమంతులు పేదలపాలిట రాక్షస సార్వభౌములు” అని ఒకవేడి నిట్టూర్పు విడచాడు. హిందూదేశంలో శ్రీమంతులవల్ల పొందేబాధలకు

ప్రతి దినమూ కార్మిక కర్షకులు అల్లాంటి వేడినిట్టూర్పులను ఎన్నివందలు, వేలు, లక్షలు విడచుచున్నారో కదా! నేటి హైందవ దేశపు కార్మిక కర్షకులస్థితి ఎప్పుడు చక్కబడునో కదా! అట్టి దేశకళ్యాణ ప్రదమైన రోజు లెప్పుడునచ్చునో కదా!

* * *

యజమానిదగ్గఱ తీసుకున్న యాభైరూపాయలతోటి సుబ్బాయి కుమార్తెయొక్క వివాహం శుభంగానే జరిగింది. ఒక సంవత్సరం గడిచింది. ఈసంవత్సరంలోగా ఎలాగైనాసరే యజమాని అప్పు తీసుద్దామని శతవిధాలా ప్రయత్నంచేశాడు సుబ్బాయి. ఫలితం దక్కలేదు. సంవత్సరందాటిన మొన్నాడే ఇంట్లోనుంచి వెళ్లిపొమ్మని యజమాని ఫర్మానా చెయ్యడం మొదలెట్టాడు. నాలుగు రోజులు గడువు యివ్వండి అని సుబ్బాయి యజమానిని ఎంతదీనముగ ప్రార్ధించినను, ఆ ఇనుప హృదయమునకు దయకలుగలేదు. చివఱకు యజమాని ఒక గుమాస్తాచేత సుబ్బాయికుటుంబాన్ని బయటకు గెంటించాడు. ఆరోజునుంచీ సుబ్బాయిని పనిలోకి రావద్దనిచెప్పాడు. సుబ్బాయి ఒక కొబ్బరిచెట్టు తోట్టబయట ఒక తాటాకుల పందిరి వేసుకుని అక్కడ కాపురంవున్నాడు. తింటానికి తిండి వేదు. వూళ్లోకెళితే రోజంతా పనిచేయించుకుని ఒక అణా డబ్బులిచ్చేవాళ్లు. ఆఅణాడబ్బులూ పదిమందిగల ఆకుటుంబానికి చాలేవి కావు. అర్ధాన్నం. ఆపదిజీవులూ ప్రపంచంలో నిలవడానికి ఆధారంగావుండేది ఆఅణాడబ్బులు. అసలు చచ్చి

పోతే ఏకష్టమూవుండదు. చచ్చీ, చావకుండావుంటే చాలా బాధగా వుంటుంది. అల్లాగే యిప్పుడు సుబ్బాయికుటుంబం చచ్చీచావకుండా వుండన్నమాట. అన్నం పూర్తిగా దొరకడం లేదు. అసలు దొరకకపోవడంలేదు. ప్రాణాలు నిల్చేటందులకుమాత్రం సగం అన్నం దొరుకుతోంది. ఇది ఇల్లావుండంగా యజమానియగు లక్ష్మీనారాయణకు, సుబ్బాయిమీద మంచి కసిగా వుంది. డబ్బుయిచ్చి మనుష్యులచేత కొట్టించాలని చూస్తున్నాడు.

* * *

రాత్రి సమయం. సుమారు పన్నెండు గంటలవుతుంది. ఆరోజు పగలల్లా సుబ్బాయి వూరంతా తిరిగినా ఒక దమ్మిడీ యైననూ దొరకలేదు. ఆరోజు కుటుంబమంతా పస్తు. వాడిపోయిన ముఖంతో, లోపలకు తోసుకునిపోయిన డొక్కలతో, మూతలు పడుతూన్న నేత్రములతో, ఆకలితో ఘోషిలుచున్న కడుపులతో తలోక ప్రక్కా పడివున్నారు. సుబ్బాయిమాత్రం లక్ష్మీనారాయణగారి యింటికెదురుగా యున్న అరుగుమీద ఒక చిన్నగోడ్డలిని పది తాళంచెవులను పట్టుకుని కూర్చున్నాడు. "తిన్న యింటివాసములు లెఖ్ఖపెట్టుటయా! తెగనికుని చెయబోతున్నాను. యజమాని గృహమున దొంగతనము చేయుటయా!" అని ఒక నిముసము "ఛా! వీడు ఛండాలుడు. రెండువందల రూపాయల యిల్లు యాభై రూపాయలకు వేసుకున్నాడు. అదీగాక నన్ను పనిలోనుంచి వెళ్లిపొమ్మని నానోట మట్టిగొట్టినాడు. ధనమదాంధుడు

యీదుర్మార్గుడ్ని వదలగూడదు." అని ఒక నిముసమూ,— యీవిధంగా నిముసానికి ఒక్కొక్క ఆలోచనతో, ఆలోచనా సముద్రంలో మునిగి తేలుతూన్నాడు. చివఱకు సుబ్బాయి ఆసామానుతో 'యీనాటికింత దుర్మార్గమైన పని చేయవలసివచ్చినదిగదా' యని దుఃఖిస్తూ లక్ష్మినారాయణ యింటి బయటగోడ యెక్కి మెల్ల మెల్లగా లోపలకు దూకాడు. ఒకద్వారం దగ్గఱకు వెళ్ళి ఆతలుపు ఎత్తేశాడు. సరాసరి లోపలకు వెళ్ళాడు. ఒక చిన్నట్రంకుపెట్టె ఎదురుగా కనబడ్డది. దాన్ని నెత్తిమీద పెట్టుకుని బయటగోడ యెక్కాడు. కొంచెం దూ ర ం గా విజిల్ వినబడ్డది. ఒక్క నిముసంలో నలుగురు పోలీసులు సుబ్బాయి చుట్టూ కూడారు. ఒకడు సుబ్బాయి ముఖంమీద ఫోకస్ వేసాడు. ఇంతలో లక్ష్మీనారాయణగారు అరుచుకుంటూ లోపలనుంచి వచ్చాడు. "దొంగ, దొంగ" అని. ఆ చుట్టుప్రక్కల వాళ్ళందరూ చెడతన్నారు. "నాసొమ్ము కొంత యీయింట వుండనుక్కే వచ్చాను. రెండువందల రూపాయీలయిల్లు యాభై రూపాయీలకు వేసుకోడం దొంగతనం కాదూ! నాకుటుంబమంతా తినుటకు తిండిలేక ఆ కొబ్బరిచెట్టువద్ద పడివున్నారు. వడ్డీమిష బెట్టి నూటయాభై రూపాయీలు యీయన కాజేస్తే ఏపోలీసువారూ ఆనాడు రాలేదు. మాసొమ్మును న్యాయంగా తీసికెళ్లడానికి వచ్చేసరికి యీ పోలీసువారందరూ పోగయ్యారా! యజమాన్లు మమ్మల్ని ఎంత కష్టపెట్టుచున్ననూ ఎవ్వరూ ఏమీజోక్యం కలిగించుకోరు." అన్నాడు సుబ్బాయి.

సుబ్బాయికి న్యాయాధిపతి నాలుగు సంవత్సరాలు శిక్ష తగిలించాడు. ఇంట సుబ్బాయిభార్య, భర్తకోఅకు చాలా దుఃఖిస్తోంది. కోతల్లో మాలక్ష్మి ప్రతిపూటా కూలి కెళ్ళి పదిరూపాయలు సంపాదించుకుంది. భర్తను చూచుటకు ప్రక్కయింటి కుఱ్ఱాడ్ని తీసుకుని రాజమండ్రి వెళ్ళింది. కానిస్టేబులకు ఐదారు రూపాయలు కమీషనులు యిచ్చి ఎలాగైతే నేమి భర్తను చూడటం లభించింది సుబ్బాయిని జూచేసరికి మాలక్ష్మికి నేత్రముల వెంట రెండు బాష్పకణములు రాలాయి. "లక్ష్మి ఏడవబోకు! ఎందుకు ఏడుస్తావు. అక్కడకంటె నాకు ఇక్కడనే హాయిగావుంది. వేళకు యింత అన్నం పడేస్తారు. గుడ్డకు కఱువులేదు. న్యాయాధిపతి నాకు నాలుగేండ్ల శిక్ష వేశాడు. నేను అనుభవిస్తున్నాను. నాకు ఇది శిక్షగా తోచడంలేదు. రక్షణగా తోస్తోంది. న్యాయాధిపతి నన్ను రక్షించాడనిపిస్తోంది. నాయందు దయచేతనే నాకు నాలుగేండ్లు శిక్ష వేశాడు. నాకు నిజంగా కడుపుకు కూడు పెట్టాడు. ఇప్పుడు మనమనుకునే న్యాయము శుద్ధ అన్యాయము. ఈ న్యాయవాదులూ, ఈ న్యాయాధిపతులు వీరందరూ ఈ అన్యాయానికి సపోర్టుగానే నడుస్తూంటారు. నానోట మన్నుకొట్టి రెండువందల రూపాయల గృహాన్ని యాభైరూపాయలకు వడ్డీ మిష బెట్టి వేసుకున్న లక్ష్మినారాయణ న్యాయస్థుడా? నేను నేరస్థుడినా? ఇదేనా న్యాయం! ఇదే నా ధర్మం! ఇకపో! లక్ష్మి! పో! అన్నాడు సుబ్బాయి.

---

# 3. కార్తికరత్నం

ఆనాటికి బాపడు ఇంటికొచ్చి నాలుగు దినములైంది. చంద్రికి ఏమీ తోచటంలేదు. చంటిపిల్లాడికి పాలులేవు. పిల్లాడు ఒకటే తీరుగా పోరుపెట్టి ఏడుస్తుంటే చంద్రిగుండె గుభేలు మంటోంది. దానికి తగ్గట్టు కుఱ్ఱాడి అవస్థ. ఆమె జీవాత్మ ఎంతఘోషిల్లుతోందో దైవానికే ఎఱుక, ప్రతి నిముసమూ భర్త కొఱకు ఎదురు జూడడమూ, అతడు అంతులేనందున నిరాశతో తన విషాద సంసారాన్ని గూర్చి ఎన్నో విధముల తలపోయుచూ, దుర్భరకష్టమయ ఘట్టములు జ్ఞాపకానికొచ్చినప్పుడు చిన్న పిల్లవలె వెక్కి వెక్కి ఏడ్వటం. ఇలాంటి పరిస్థితిలో ఆమె అంతరాత్మ ఎంత కష్టపడుతోందో ఎవరికెఱుక! ఆమె స్థితి వెనుక గొయ్యి, ముందు నుయ్యియను సామెత ప్రకారమున్నది. ఒకచో దుర్భరదారిద్రము. ఇంకొకచో భర్త యొక్క దుర్గుణములు. ఇక నామె సంతోషము పొందుటకు అవకాశ మెక్కడిది? తైలస్పర్శలేని ఆమె కుంతలములు గాలికి ఒక విధమైన సొంపుగా యెగురుతున్నాయి. ఆమె నేత్రములు శాంతి వంతములయ్యునూ, ఎడతెగని మనోవ్యధచే శాంతి విహీనములైనవి. ముఖము ఆకలికి వాడినది. శరీరము ఒక అడుగైననూ నడువలేక అమిత నిస్సారముతో నిండియున్నది. చంద్రి యిట్టి విషాదకరమగు పరిస్థితులయందుండిననూ, ముఖముమీద బెత్తెడు కుంకుమబొట్టు మాత్రము మానలేదు. మనిషి బక్కచిక్కి ఎనలేని మనోవ్యథచేతనూ,

ఆకలి పిశాచముచేతనూ, బాధింపబడు చుండినను 'కుంకుమ బొట్టు' ఆమెకు నెంతయోకళ నిచ్చుచున్నది. భారతదేశమందు జన్మించిన స్త్రీలకు కల్యాణ ప్రదమైన చిహ్నము అదియే గదా ! హైందవజాతి స్త్రీ ముఖ్యవిధి అయ్యదియేగదా !

చంద్రి, తన భర్తరాక ఎంతసేపటికిని లేకపోవటంవల్ల చీరె కొంగు క్రింద పరచుకుని దానిమీద వాలింది. చంద్రికి ఒక నిద్రకునుకు పట్టింది. వెంకటస్వామి త్రాగి క్రిందుమీదు గానకుండా బజారులయం దున్నవారలను ఊరకనే బూతులు తిట్టుతూ, సింహము గాండ్రించునట్లు గాండ్రించుచూ, తూలుతూ, మైమఱచి మెల్లమెల్లగా నడుచుచూ వచ్చాడు. ఇంటికి చంద్రి భర్తయొక్క రాకను గుమ్మముదగ్గతే జూచింది. వెంకటస్వామి తడబడిన కంఠంతో "కూడుబెట్టు" అన్నాడు. చంద్రి ఆశ్చర్యబోతూ "కూడు ఎక్కడిది నీవు యింటికిరాని యీ నాలుగు దినములనుండీ, నేనూ, పిల్లాడూ ఉపవాసములే చేస్తూన్నాము. నాకు కూడులేదు; పిల్లాడికి పాలులేవు" అంది. వెంకటస్వామి అమితాగ్రహంతో "ఎప్పుడూ యీ లాగే మొర పెడుతూంటావు." అని చంద్రిని కర్రతో పడమోదాడు. చంద్రి వొళ్లు తెలియకుండా పడిపోయింది. నోటి వెంట నురుగులు గ్రక్కుతోంది. ఆమె ప్రక్కనే పసిపిల్లాడు అమితంగా* ఘోషిస్తున్నాడు. ఆ దృశ్యం ఏమాత్రపు జాలినీ వెంకటస్వామికి కలిగించలేదు. త్రాగుడుచే మదించియున్న ఆతని ఇనుపగుండె ఇంతమాత్రమునకే కరుగునా ? "చావు" అని వెంకటస్వామి వెళ్ళిపోయాడు.

చంద్రికి ఒక గంట తాళినతర్వాత ప్రాణమొచ్చింది. తన ప్రక్కన అపరిమితంగా గుక్కపెట్టి ఏడుస్తూన్న కుర్రాడ్ని జూచింది. "నాయనా రారా" అని దగ్గరకుతీసుకుని ఒక ముద్దెట్టుకుంది. కడుపు మలమలమాడి ఏడుస్తూన్న ఆ పసికందు, మాతృదేవియొక్క ప్రేమపూర్వకమైన ముద్దుతో ఉపశమించునా? చంద్రి ముద్దెట్టుకున్నప్పుడు మాత్రం "అహ్హాహా" అని పకపక నవ్వాడు. ఆనవ్వును జూచి ఆకలిదేవత సహించలేక ఆపసికందును మరీ బాధించడం మొదలెట్టింది. మరుక్షణంలో 'బోరు' మని పెద్దగాఏడ్వడం మొదలెట్టాడు. "నాయనా! నీ యేడుపు చూడలేకున్నానురా! తిండికి గతిలేని యీ పేదరాలి కడుపున దేవుడు నిన్నెందుకు పుట్టించాలి? లేకలేక పుట్టిన ఒక్క పుత్రుని పోషించడం నాచేత కావడంలేదుగదా? నీవేగనుక భాగ్యవంతుల్లో ఏగౌడ్రాలికడుపునో పుట్టినట్లయితే, నీవు ఎంతగారాబంగా పెరిగేవాడివోగదా!" అంది చంద్రి తన పుత్రునివంక మాతృప్రేమ వుట్టిపడే దృక్కులతో.

ఆదారినే పదిమంది కార్మికపడుచులు పచ్చిగడ్డికై, తట్టలను నెత్తిమీద పెట్టుకుని పదాలను పాడుకుంటూ, మధ్య మధ్య వారిలోవారు ఎగతాళి చేసుకుంటూ, ఎంతో సంతోషంగాను, ఎంతో వినోదంగానూ వెళుతున్నారు. చంద్రి గుడిసెలోని పిల్లాడి ఏడుపువిని ఆ పదిమంది పడుచులూ గుడిసెలోపలికివచ్చి చంద్రియొక్క దీనదృశ్యాన్ని తిలకించారు. "చంద్రీ! ఏమిటీదశ?" అన్నది అందులోని ఒక పల్లెపడుచు. "ఏమనిచెప్ప నక్కా! మీ మరిడి ఇంటికొచ్చి యివ్వాళిటికి

నాలుగు రోజులయింది. యీ నాలుగు రోజులనుండీ నాకు కూడూ, పిల్లాడికి పాలూ లేవు. ఒకగంటకుముందే వచ్చి నన్ను పడమోది చక్కాబోయాడు" అంది చంద్రి తన నీలినేత్ర ములవెంట బాష్పకణములు రాలుస్తూ. పదిమంది పడు చులూ, ఒకరిముఖం ఒకరు చూచుకున్నారు విచారసూచ కములైన నేత్రములతో. "మన కూలిపల్లెలోని స్త్రీలు, త్రాగుబోతులగు భర్తలయొక్క దుండగములను సహింపలే కున్నారు మాఆయన యింతేగా! కూలి డబ్బుల్లో ఒక్క దమ్మిడీ ఇంట్లోకని ఖర్చుపెట్టడు. నేను పచ్చిగడ్డిని అమ్మిన డబ్బుల్నికూడా యిమ్మని తంతాడు" అంది ఒక పడుచు వేడి నిట్టూర్పు విడుస్తూ. కార్మికుల బీదరికమును తలుచుకుంటే గుండె ద్రవీభూతమౌతోంది. దానికితోడు త్రాగుడుగూడా జత అవుతోంది.

చంద్రిని ఆస్త్రీలు ఓదార్చి లేవదీసి "పచ్చిగడ్డికెళదాం పద. ఒక పావలానైనా దొరకకపోదు. పావలాకు రెండు చిన్న పాలడబ్బాలు వస్తాయి." అన్నారు. చంద్రి తన ముద్దుల కుమారుడ్ని ఒక్క ముద్దిడుకుని ఊయలలో పడుకోబెట్టి పచ్చి గడ్డికోఅకై బీడు కెళ్లింది. సాయంత్రం ఆరుగంటలకు ఒక తట్ట పచ్చిగడ్డిని అమ్ముకుని పావలాడబ్బులతో బియ్యమూ, పాలడబ్బా తెచ్చింది. పిల్లాడు ఏడ్చుటకుగూడా అశక్తుడై కళ్లుమూసుకుని శోషిల్లియున్నాడు. చంద్రి పిల్లాడ్ని 'నాయనా' అని ఎత్తుకుంది. హీనస్వరంతో ఏడుపు మొదలెట్టాడు. చంద్రి కుఱ్ఱాడ్ని కాళ్ళమీద పరుండబెట్టుకుని పాలుబోస్తోంది. ఆ

పల్లెలోని కార్మికవర్గానికి చెందిన స్త్రీలంతా చంద్రిదగ్గఱకు పరువెత్తుకువచ్చి గొంతుయెత్తి ఏడ్వడం మొదలెట్టారు. చంద్రి కేమీ అర్థం కావడంలేదు. చంద్రి "ఏమిటిది!" అని ఆశ్చర్యంతో అంది. "అమ్మా! చంద్రి! నీ పసుపుకుంకం యివ్వాళ్ళటితో సరి. మీ ఆయన అకాత్తుగా గుండె ఆగి చనిబోయాడట. శవం రోడ్డుమీద పడివుందట. గుండె ఆగి చచ్చిపోయాడని డాక్టర్ నిర్ధారణజేశాడు" అని మాత్రం రుద్ధమైన కంఠంతో చెప్పగలిగింది ఒక స్త్రీ. "త్రాగుడే నాకొంప దీసింది" అని పెదపెట్టుగా ఏడుస్తూ భూమిమీదకు వాలింది. ఒకగంటకు శైత్యోపచారఫలితంగా ఆమెకు స్పృహ తెలిసింది.

వెంకటస్వామి మరణించిన తర్వాత, చంద్రి ప్రతి రోజూ బీడుకెళ్లి పచ్చిగడ్డికోసి సాయంత్రానికల్లా పావలా డబ్బులు కళ్లజూచేది. వెంకటస్వామి బ్రతికివున్నప్పుడు కంటె ఇప్పుడే ఆమెజీవితం యెంతో హాయిగావుంది. ఒడుకుదుడుకు లేని సంసారం. శాంతజీవనం. చంద్రిజీవితంలో యిదొక నూత్న ఘట్టం. పిల్లవాడికి అయిదో ఏడువచ్చింది. చంద్రి పిల్లాడియొక్క జీవితాన్నిమాత్రం బాగా కాపాడింది. త్రాగుడుజట్టులో జేరకుండా ఏదైనా శాంత జీవనానికల వడితే బాగుండుననుకునేది చంద్రి. కుఱ్ఱాడిని చంద్రి వెన్నెల రాత్రి సమయములందు దగ్గఱ కూర్చోబెట్టుకుని తనకు తెలిసినంతవరకూ హైందవ వీరుల్నిగురించి చెప్పేది. పుత్రుడ్ని దేశసేవకునిగా తయారుచేయడమే హైందవమాతయొక్క ముఖ్యవిధియని తలంచింది. రామనాథానికి యేటికియేడు

పైబడ్డగొలదీ, అతని హృదయంలో స్వాతంత్ర్య బీజములు మొలకలెత్తట మారంభించాయి. స్వాతంత్ర బీజములకు చంద్రి మడితవ్వి సవ్యంగా నీరుపోయకుండా వున్నట్లయితే, బీజములంతటితోనే నశించిపోయివుండేవి. త్రాగుడు అతడు ముందెన్నడైనా నేర్వబోతాడేమోనని అతనికి త్రాగుడు యెడల యిప్పుడే అసహ్యం కలిగించేటట్లు బోధించింది చంద్రి. దేశసౌభాగ్యానికి తోడ్పడే పుత్రులనుగన్న మాతృకల యొక్క మాటేమి చెప్పవలయును. స్వాతంత్రం దేవతకు ఒక పూలహారమొనర్చినట్లేగదా!

కాలచక్రం గిరగిర తిరిగింది. దినములు మాసములు, సంవత్సరములు వెళ్లిపోయాయి. రామనాథం (చంద్రి ముద్దులకుమార్డు ఆపల్లెలోని బోర్డు ఎలిమెంటరీ స్కూలులో ఎనిమిదియవ తఱగతియందు ఉత్తీర్ణుడయ్యాడు. హైస్కూలులో విద్యాభ్యాసము చేద్దామని రామనాథంకు కలిగిందిగాని గృహపరిస్థితులు అతని తలంపును ఖండించి వేసినాయి. చంద్రికి వృద్ధాప్యం సంప్రాప్తించింది. ఇదివఱకులాగా చంద్రి చాకిరిజేసి సంపాదించ లేకుండా వుంది. తన చెయ్యాడుతేగాని డొక్కాడదు. ఇక విద్యయందు ఆశపెట్టుకున్న లాభము లేదని, ఒక మిల్లులో కూలీగా జేరాడు. మిల్లులోజేరింది మొదలు మిల్లుకూలీలు యనుభవించు దుర్భరకష్టములను ఆతడు సహింపలేక బోయినాడు. ఆమిల్లు యజమాని కూలీల యొక్క జీతాన్ని సగం చేశాడు. రామనాథం ఆకూలీల సంఘమునకు నాయకుడై సమ్మెసాగించాడు. తనయొక్క

ఉపన్యాస ప్రభావంచేత రెండువేల కూలీలలో ఒక్కడుగూడా మిల్లులో కెళ్ళకుండా జేశాడు. ఏమీ తెలియక మూర్ఖత్వంలో పడియున్న కార్మికుల్లో నూత్నచైతన్యం కలిగించాడు. రామనాధాన్ని పరిమార్చినట్లయితే యీసమ్మె యింతటితో ఆగ వచ్చునని యజమానికి అభిప్రాయం గలిగింది. యజమాని ఎందరో దుండగీడులకు, ఎంతో ధనమిచ్చి పనికి పురిగొల్పాడు.

* * *

అది సాయంకాలసమయము. బూడిదమబ్బు లాకసమునంతనూ వ్యాపించుచున్నవి. సూర్యభగవానుడా మేఘముల్లో నంతర్ధానమయ్యెను. కాని యాతని కిరణములు మేఘముల్లో తమ తీక్షతను గోల్పోయి చల్లగా ప్రకాశించు చున్నవి. మందమారుతము హాయిగ వీచుచున్నది. ఆ విరిగుత్తులనుండి మనోజ్ఞ సుగంధము మలయానిలుడు బయట పడినప్పుడు దొంగిలించు చుండెను. లేజిగురు కొమ్మల మాటుల కోయిల విన సొంపుగా గానము చేయుచుండెను. రామనాధం కృష్ణానది ఒడ్డున ఒక ఇసుకతిన్నెమీద కూర్చొని కార్మికోద్యమాన్ని గురించి తీక్షణముగా నాలోచించుచుండెను. వెనుకనుండి నాలుగు కత్తులు అతని కంఠం మీద బడ్డాయి. ఆప్రదేశమంతయూ నెత్తురుప్రవాహమై పోయింది, "అబ్బా" అని రామనాధం ప్రక్కకొరిగాడు. కూలిజనంలో తెలివిగలవాడుండడం యజమాన్లకు గిట్టదు. అలావుండడం వారికి ఎప్పటికైనా అపాయమనే వారి యభిప్రాయం.

[13]

# 4. దేశ సేవకుడు

"నా ఆనందమయ జీవితాన్ని విప్లవాగ్నికై ఆహుతిపర్చుటకు సిద్ధముగాయున్నాను. మీరు నాకు ఎట్టిశిక్ష విధించిననూ తలయొగ్గి, సంతోషముతో అనుభవించెదను. ధనిక వర్గమువల్లనూ, సామ్రాజ్య వాదులవల్లనూ, పీడింపబడుచున్న కార్మికవర్గంలో ఒకవిధమైన నూత్నచైతన్యమును కలిగించుటకు గడచిన పది సంవత్సరముల నుండియూ నేను శ్రమించుచున్నాను. అట్టి నా యొక్క శ్రమకు ఏమైనా ఫలితం కలిగిందా అంటే, పది దినములనుండియూ మీ ఉత్తరువులను పాటించి, ఏ మాత్రమునూ వెనుదీయక, ఉరిస్థంభములమీద ఆనందముతో నెక్కిన యువకులత్యాగమే నాశ్రమకుఫలితం అని చెప్పొచ్చు. అవిద్య, అజ్ఞానములలో మునిగి తేలుచూ, ధనిక వర్గంయొక్క దోపిడిని గ్రహించలేక, ప్రభుత్వపు అధిక పన్నులను చెల్లించలేక మొరలిడుచున్న రైతువర్గాన్ని, పది సంవత్సరాల కాలంలో, వారిని సామ్యవాదులుగా తయారు జేసిన నాకు, యిక మాతృదేశ ఋణంలేదు. కాని ఒక్క మాట మాత్రం మీరు గట్టిగా గ్రహించాలి, నన్ను ఉరికెక్కించిన మాత్రాన దేశంలో సామ్యవాదం నశించదు. ఎక్కడైనా చూడండి. ప్రతి కార్మికుని నోట్లోనూ, సామ్యవాద ఆదర్శాలే పఠింపబడుతుంటాయి. ఏ కూలినిగాని, ఏ రైతునుగాని కదిలించండి. వానికి చదువుట రాకపోయిననూ, అక్షరజ్ఞానము లేకపోయిననూ, వివిధదేశాల్లో సామ్యవా

దాన్ని వృద్ధిబొందజేసిన మహామహుల చరిత్రలు మీకు అప్పగిస్తాడు.

నా శరీరంలో ప్రవహించే వేడిరక్తములోని ప్రతి కణముగూడా నేను పూనుకున్న ఉద్యమాభివృద్ధికి ఉత్సాహ మొసగినది. నాలాటి ముఖ్యులను, పదిమందినీ, నాకంటె ఎక్కువ శక్తిసామర్థ్యములు గలవారిని, కార్యదీక్షయందు నాకంటె ఎక్కువగా నిమగ్నులగువారిని పదిమందినీ తయారు చేశాను. నా మరణమువల్ల దేశములో శాంతిగలుగదు. అశాంతి ప్రబలును. నా మరణమువల్ల దేశములో నలువైపులా విప్లవాగ్ని రగుల్కొని, యిది చాల పెద్దసమస్యగా పరిణమించును. నా మీద నిర్బంధ శిక్షావిధానమును ప్రయోగించవద్దు. నా ప్రాణములు ఆక్షణంలోనే బాసే శిక్ష ఏదైనా విధించండి. నేను యిప్పుడు మరణమునకు వెరచి, పిరికిపందనై మీకు క్షమార్పణాపత్రము వ్రాసియిచ్చితినా; ఒక్క నాదేశానికేగాదు; ప్రపంచానికంతకూగూడా ద్రోహంచేసినవాడ్ని అవుతాను. నా సోదరుల హృదయములలోని స్వాతంత్ర్యశక్తిని హత్యజేసినవాడ్ని అవుతాను. 'ఫలాని 'బరోసైన్' మరణమునకు వెరచి, ప్రభుత్వమునకు క్షమార్పణపత్రము వ్రాసియిచ్చినాడు' అను అంశము తరతరములా ఫ్రెంచిదేశ చరిత్రయందు రక్తఅక్షరములతో లిఖింపబడియుండును. అట్టి అవమానమును నా సంతతివారలు భరించలేక 'యీ పిరికిపంద మన వంశమున నెందుకు జన్మించెనా' యని నన్ను పలువిధముల దూషించెదరు.

అదియునుగాక గడచిన పది దినములనుండియూ ఉరి స్థంభమున కెక్కిన యువకుల మరణమునకు నేనే గారకుడను గదా? నా యాకర్షణశక్తిచేతనేగదా; వారు అదురూ బెదురూలేకుండా ఉరిస్థంభముమీద నెక్కి, తమతమ సౌఖ్యమయ నిండుజీవితాలను మహాత్యాగంతో సర్పించినది! అట్టి త్యాగశీలురగు యువకులను ఉరిస్థంభాల కెక్కించి, నేను ప్రభుత్వానికి క్షమార్పణపత్రము వ్రాసియిచ్చి, మీరు నాకు అదనముగా లంచమిచ్చు ధనముతో సర్వభోగములనూ యనుభవించుచూ నేను జీవించవలయునా?

ఫ్రెంచిమాతకు పుత్రులైన మీరు ఉద్యోగధర్మములను ననుసరించి నాకిట్టి సలహానిచ్చుట యెంతయూ వింతకరముగ నున్నది. ముందు నాకెట్టి మరణముండునో? ఎట్టి దుర్వ్యాధివల్ల మరణింతునో? ఇప్పుడో, సంపూర్ణ ఆరోగ్యమందు, ఆనందంతో, సంతోషంతో, దేశంకొరకై నా నిండుప్రాణాన్ని వదలివేసినయెడల, యుద్ధమందు మరణించిన వీరులకు సంప్రాప్తించు వీరస్వర్గం నాకు సంప్రాప్తించును......"

అని బరోసైస్ ఫ్రెంచి కార్మిక విప్లవకారులలో నొకడు నిబ్బరంగా ఫ్రెంచి ప్రభుత్వ న్యాయస్థానంలో చెప్పాడు. న్యాయాధిపతి చెవులొగ్గి దీక్షతో ఆతని ఆశయాలన్నిటినీ విన్నాడు. న్యాయస్థానంలోవున్న లాయర్లు అందరూ అమిత విచారముతో 'బరోసైస్ అంతటివాడు యీదేశానికి లేకుండా బోతున్నాడు' అను దిగులుతో అటూ, యిటూ, పచార్లు చేస్తున్నారు. బరోసైన్ తన ఆశయాన్ని చెప్పడం ఆపివేసిన

తర్వాత ఓ పదినిముసములపాటు న్యాయస్థానమంతా నిశ్శబ్దంగా వుంది. న్యాయాధిపతి వ్రాయడం ఆపి, బరోసైస్ వంక గంభీరంగా జూస్తూ "బరోసైస్! నీకుయిదే ఆఖరి అవకాశం. నీలాటిముఖ్యులు యీదేశంలో పదిమందిగాదు; వెయ్యిమంది వున్ననూ, వారినందరినీ, ప్రభుత్వం ఒక్క బాంబుదెబ్బతో అణిచివేయగలదు. ప్రభుత్వం సైనిక సహాయంవల్ల, సామ్యవాదులను దేశంలోలేకుండా జేస్తుంది. నీవు ఎన్నో నీతిశాస్త్రాలు చెపుతున్నావ్! ఇన్ని నీతిశాస్త్రాలు తెల్సిననీకు, రాజద్రోహము కూడదని తెలియదా?"

"ప్రభుత్వానికి సైన్యసహాయంవల్ల సామ్యవాదులను రూపుమాపగల ధైర్యముంటే, సామ్యవాదులగు మాకు 'ఉద్రేకము ఐకమత్యము' అను యీ రెంటి కంకణముల వల్ల ప్రభుత్వాన్ని రూపుమాపగల ధైర్యముంది" అన్నాడు బరోసైస్ గంభీరంగా. న్యాయాధిపతి మరల కాగితం మీద ఏదో వ్రాయడం మొదలెట్టాడు. మళ్లీ ఓపది నిముసాలు నిశ్శబ్దం. బరోసైస్ యీసారి న్యాయాధిపతికిచ్చిన జవాబుకు, వకీల్సు, ప్రముఖులగు కొందరు దేశీయులు మరీ హడలిపోయారు. న్యాయాధిపతి నోటినుండి ఏమికాఠిన్యపు వాక్కులొస్తాయో అని నిరీక్షించుచున్నారు. న్యాయాధిపతి తాను వ్రాసిన వ్రాతలను పదిసార్లు మెల్లగా తనలోతాను చదువుకుని, పదకొండవసారి పైకి బిగ్గరగా రుద్ధకంఠంతో చదవడం మొదలెట్టాడు 'కార్మిక విప్లవకారుల్లో ముఖ్యుడగు బరోసైస్ ప్రభుత్వమును కూలద్రోయుటకు కొన్ని కుట్రలు,

పన్ను చుండెను' అను నేరముక్రింద, ఫ్రెంచి ప్రభుత్వన్యా యస్థాన నియమముల ననుసరించి ఉరివేయుటకు ఉత్తర్వు గావించఁబడినది.

ఆశిక్ష విన్నంతనే దేవుడ్ని స్మరింపనివారు లేరు. కాని బరోసైన్‌కు ఆనందం పొంగి పొరలుతోంది. అతని పెదవులపై చిరునవ్వు తాండవమాడుతోంది. నలుగురు సోల్జర్లు గబగబావచ్చి బోనుమీద నిలబడియున్న బరోసైన్‌కు ఇనుప సంకెళ్లను హస్తములకు తగిలించి, తీసుకెళ్లారు. తన మరణ వృత్తర్వునకు యింతమంది విచారించినా, బరోసైన్ మాత్రం విచారించలేదు. సోల్జర్లు బరోసైన్‌ని ఒక పెద్దమైదానం లోనికి దీసుకెళ్లారు. ప్రజలు లోపలికి రాకుండా సైనికపటాలం కాపలా వుంది. ఒక లక్షమంది జనం పోగయ్యారు. "వీరుడగు బరోసైన్ ఆత్మకు శాంతి కలుగు గాక!" యని పెద్దపెద్ద కేకలు ఆజనం గుంపులోనుంచి వినబడు చుండెను.

బరోసైన్ ఒకచిన్న రాతిదిమ్మమీద నిలబడ్డాడు. ఆరాతిదిమ్మకు కొంచెం దూరంగా, ఒకసోల్జరు తుపాకీని సరిజేసుకుంటూ నిలబడ్డాడు. "ఆరోసైన్ నీయవసానకాలపు కోర్కెను దెల్పుము" అన్నాడు ఒకపెద్దఅధికారి. "ఫ్రెంచి దేశములో ప్రజాప్రభుత్వ స్థాపనయే నాఅంత్య కోరిక" అన్నాడు బరోసైన్ ఏమీ తొణక్కుండా. ఇంతలో తుపాకీగుండు 'ధన్' మని ప్రేలింది. అది బరోసైన్‌కి తగులలేదు. గురితప్పి పోయింది. బరోసైన్ ఒక్కమాటుగా నేత్రములుమూశాడు. గత పదిదినములనుండియూ ఉరిస్థంభముల కెక్కుచున్న యువ

కులందరూ చేతులుజాచి 'మాలో జేరుదుగానిరా' అని అన్నట్లు దోచింది. రెండవ గుండు ప్రేలింది. బరోసైన్ శరీరం మలమల మాడిపోయింది.



# 5. మహోత్యాగి

యీకథసము అనువాదముగాని, అనుసరణముగాని గాదు
స్వవ్యూహాలే ఆధారములు

అది ఇరువదియవ శతాబ్దపు ప్రారంభదశ రష్యాలో కార్మిక విప్లవోద్యమం జోరుగా సాగుతోంది. ఏ సందు గొందుల్లో జూచినా సామ్రాజ్యవాదాన్ని, క్యాపిలిష్టుల దోపిడీనీ తిరస్కరించిన వుపన్యాసాలు విప్లవోద్యమాన్ని రేకెత్తించే కరపత్రాలు ప్రతిదినమూ జైలుఖానాలకేగుచున్న యువకుల సంఖ్య అమితముగాయున్నది.

ప్రాణమానములను లెక్కసేయక మానవ సౌభాగ్యం కొఱకు, వినోదంగా ఆడుతూ పాడుతూ నవ్వుతూ జైలుఖానాలకేగుచున్న యువకులు కొందరు, మారుమూల సందుల్లోగూడ పదిమంది కార్మికులను ప్రోగుచేసి వారికి క్యాపిలిస్టుల దోపిడి విధానమును బోధించి వుద్రేకమును కల్పించి వారిని కార్యరంగంలోకి దూకుటకు సిద్ధము జేయుచున్న యువకులు కొందరు, "మానవ సౌఖ్యముకొరకై పాటుబడుడు కార్మికసోదరా మేల్కొనుము. నీస్వేచ్ఛకు అంతరాయము కల్పించే ధనసామ్రాట్టులకు ఇవి దుర్దినములు. నీకివి శుభదినములు అని వ్రాయబడిన కరపత్రములను గోడల కంటించుటలో అమితోత్సాహము జూపుచున్న యువకులు కొందరు, తమ సుకమారతను సైతము మానవస్వేచ్ఛయే

ప్రాధాన్యముగా గైకొని ప్రచారము సాగించుతూన్న వనితలు కొందరు, ఈవిధముగా దేశమంతయు మానవసౌఖ్యము కొఱకు ఆందోళన సల్పుచున్నది.

కైర్ అప్పుడే ఒకఫ్యాక్టరీవద్ద వుపన్యాసమిచ్చి యింటికి జేరుకున్నాడు బనియన్ స్టాండుకు తగిలించి, ఒక చిన్న లుంగీగుడ్డ చుట్టుకొని "జోమ్లీ" అని పిలచాడు. జోమ్లీ కిలకిల నవ్వుతూ పరుగెత్తికొచ్చింది. "కొంచెం రొట్టె, పాలూ గావాలి" అన్నాడు కైర్. జోమ్లీ ఒక్కనిముసంలో రొట్టె, పాలు తెచ్చింది. "ధవాల్ యెక్కడ" అన్నాడు కైర్. "నీవు వెళ్ళిని రెండురోజులనుంచీ ధవాల్ లేవడంలేదు. మనోవ్యధచే కుమిలి బోవుచున్నాడు." అంది జోమ్లీ తానుగూడా అల్లాగే వున్నానన్నట్టుగా. "ఎందుకు మనోవ్యధ?" అన్నాడు కైర్ ఆశ్చర్యంగా. "యీ ఏకైక పుత్రఫలం విప్లవోద్యమాన్ని ఏనిముసాన బలియగునోయని." "అంతభాగ్యమే వుండాలిగాని, యింకా అనుకోడంఎందుకు" అంతపుణ్యమే నానొసలున వ్రాసివున్నట్టయితే, ప్రాణత్యాగియైన యీ దేశ సేవకుడ్ని దేశమునకు ప్రసాదించిన తనకువీరస్వర్గం కలుగుతుందని చెప్పు. అప్పుడేతాను ధన్యతచెందును ఎందుకు దుఃఖం జోమ్లీ. సంతోషం పొందుటకు మారుగా దుఃఖము పొందుటయా? తనకు ఉత్పత్తిచేయబడిన యీ జీవి మానవ సౌభాగ్యముకొఱకు ఏ ఇసుమంత సేవయైననూ జేయుటవల్ల తనగర్భం పవిత్రత చెందునని చెప్పు" అన్నాడు కైర్ గంభీరంగా. బయటనుంచి "కైర్" అని సింహానాదం వినబడ్డది. ఆ కేక వినేసరికి జోమ్లీకి

ప్రేల్చివేసినారట" అన్నాడు ధవాల్ దీనంగా.

నీవు నా సుకుమార జీవితాన్ని జూచి అనందించేకంటె మానవ సౌఖ్యంకోఅకు, మానవ స్వేచ్ఛకొరకు పోరాడి ప్రభుత్వ దౌర్జన్యానికి బలియైన నాశవాన్నిజూచి ఆనందిస్తే నీకు ఎక్కువ ముక్తివుంటుంది" అన్నాడు కైర్ భావొద్రేకంగా. "నాయనా" నీమాటలు నేను వినలేకున్నానురా" అని ధవాల్ గమ్యస్థానానికి జేరుకున్నాడు. "జోమ్లిా! యిక నీసంగతి చెప్పు. ఏమిటీ దుఃఖం?" అన్నాడు కైర్ ఒకవిధమైన కోపంతోనూ; ఒకవిధమైన ఉద్రేకంతోనూ; ఎక్కిఎక్కి ఏడ్చుచున్న జోమ్లివైపుతిరిగి. జోమ్లికి దుఃఖం ఆగలేదు. ఏడుపుతో గుండెఅంతా కదలిపోతోంది. కైర్ మీాదకు దీన దృక్కులను ప్రసరింపజేసింది. కైర్ కు జాలివేసింది "జోమ్లిా! చిన్నపిల్లలాగా ఏడుపు ఎందుకూ "అన్నాడు కైర్ తనహస్తాన్ని జోమ్లిాభుజంమీాద వేసి. జోమ్లిా పెద్దపెట్టున ఏడుస్తూ కైర్ మీాదకు ఒరిగింది.

కొంతసేపయ్యేసరికి జోమ్లిాయొక్క హృదయభారం తగ్గింది. జోమ్లిా యిందాకటినుంచి తన ప్రియుని కౌగిటలో యున్న సంగతిమఱచింది తలయెత్తిజూచింది. అతని పెదవుల యందు చిరునవ్వు ఒడుదుడుకు లాడుతోంది. అతనిగడ్డం పట్టు

కాని "కైర్" అంది దీనంగా "ఏం?" అన్నాడు గంభీరంగా. "నీవు లేని నాజీవితం దుఃఖభాజనంగాదూ అంది జోమ్లీ "కైర్" చిరునవ్వు నవ్వుతూ "జోమ్లీ! నీవు యెంతపిచ్చి దానవు. నేను ఎక్కడపోతానూ" అన్నాడు "ఏమో! నిన్ను ఖైదీగానే వుంచుతారని యెల్లాగూ! నీవు విప్లవకారులలో ముఖ్యుడవనీ, నిన్ను బరిమార్చితే విప్లవోద్యమానికి కొంత వఱకూ సహాయం తక్కువౌతుందనీ ప్రభుత్వముద్దేశమట" అంది జోమ్లీ ఏడుపును పునః ప్రతిష్ఠాపన జేసుకుంటూ.

జోమ్లీ! నీవు భయముచెందవలసిన యవసరంలేదు. నిన్ను నేను కలుసుకుంటేసరిగదూ!" అన్నాడు కైర్.

"ఇంకేం కలుసుకోవడం నమ్మకంలేదు" అంది జోమ్లీ తనప్రియునివంక దీర్ఘముగా జూస్తూ.

"మరుజన్మములో..."అన్నాడు కైర్ జోమ్లీయొక్క మాటను అందుకుని గంభీరంగా "కైర్! మరుజన్మలోనా!... "అంది జోమ్లీ వికటంగా.

"కైర్" అని సోల్జర్లపిలుపు వచ్చింది.

"జోమ్లీ! యికనన్ను విడు" అన్నాడు కైర్, జోమ్లీ కౌగిటలో పెనుగులాడుతూ.

"నేను విడవను" అంది జోమ్లీ కండ్లురుముతూ

"నీవు విడవవూ! నాశరీరంమీద నీకేంహక్కున్నది"

